# భవభూతి భారతి

సంస్కృత మూలకర్త

'కవిభూషణ' కుమారతాతాచార్యులు

తెలుగు అనువర్త

పండితరాజ, సాహిత్య విశారద

శ్రీమాన్ యన్. సి. వి. నరసింహాచార్య యమ్.ఏ.బి.ఓ.యల్

విద్వాన్, శిరోమణి

సంస్కృత భాషా ప్రచార సమితి

హైదరాబాదు-500 001.

భవభూతి భారతి

ప్రథమ ముద్రణ : 1994

ప్రతులు : 1000

వెల రూ. 16/-

ప్రకాశకులు :

సంస్కృతభాషా ప్రచార సమితి
(జి. పుల్లారెడ్డి ఛారిటీస్ ట్రస్ట్ అనుబంధ సంస్థ)
5-4-743 (2వ అంతస్తు)
హరేకృష్ణదేవాలయం ప్రక్కన,
నాంపల్లిస్టేషన్ రోడ్డు,
హైదరాబాదు - 500 001.
ఫోన్ నెం. 515481, 550108.

ముద్రణ : ప్రసాద్ గ్రాఫిక్స్
హిమాయత్‌నగర్, హైదరాబాదు-500 029.

శ్రీః

# ముందుమాట

సంస్కృత రూపక రచయితలలో భవభూతి అగ్రశ్రేణికి చెందిన మహాకవి. విదర్భప్రాంతీయుడైన ఇతడు క్రీ.శకం ఎనిమిదవ శతాబ్దానికి చెందినవాడని విమర్శకుల నిర్ణయం. ఇతడు రచించిన మూడు రూపకాలు ఇప్పుడు మనకు లభిస్తున్నాయి. వీటిలో మొదటిది "మాలతీ మాధవం" అనే ప్రకరణం. మిగిలినవి రెండూ రామాయణకథను ఆధారంగా తీసి కొని వ్రాసిన నాటకాలు. వీటిలో మొదటిదైన "మహావీరచరితం" అసంపూర్ణంగానే లభిస్తూన్నది. చివరి కొంతభాగాన్ని ఎవరో పూరించారు. ఉత్తరరామచరితం ఇతని రచనలలో అత్యుత్తమమైనదిగా పండితుల మన్ననలు పొందిన నాటకం.

అతితీవ్రమైన భావావేశాలను శబ్దాలలో బంధించి చూపడంలో భవభూతికి భవభూతే సాటి. రసపోషణ, రసానుగుణ పదగుంఫన, భావానుగుణాలైన వృత్తాలను చక్కగా నడిపించడం, రసానుభూతికి అంతరాయం కలగకుండా అలంకారాలను ప్రయోగించడం, వివిధ శాస్త్ర పరిచయ ప్రదర్శనా—ఈ విషయాలలో భవభూతికి గల వైశిష్ట్యం అనన్యాదృశమైనది. భవభూతి రచనలలో ఉన్న సౌందర్యాన్ని స్పష్టీకరిస్తూ 'కవిభూషణ' శ్రీకుమార తాతాచార్యులుగారు చాలాకాలం క్రితం 'భవభూతి భారతి' అనేపేరుతో ఒక ఏకవిషయగ్రంథం, (Monograph) సంస్కృతభాషలో, బాణుని శైలిని స్మరింపచేసే శైలిలో వ్రాసిఉన్నారు. ఈ గ్రంథంలో రచయిత భవభూతి కవితా వైశిష్ట్య ప్రతిపాదనకు అంగంగా అనేక అలంకారశాస్త్ర విషయాలుకూడా ప్రతిపాదించి ఉన్నారు. కావ్యలక్షణ-కావ్యహేత్వాదుల విషయంలో ఆలంకారికుల మతభేదాలు,

ఔచిత్యానికి ఉన్న ప్రాధాన్యం కావ్యంలో గుణాలంకారాదులస్థానం మొదలైన ఎన్నో విషయాలు ప్రసక్తానుప్రసక్తంగా చర్చించారు. కొంత మంది అనుకుంటున్నట్లుగా ఉత్తరరామచరితంలో ప్రధానరసం కరుణ రసం కాదని, విప్రలంభశృంగారమే ప్రధానమనీ సయుక్తికంగా నిరూపించారు.

సంస్కృతభాషలో కుమారతాతాచార్యులుగారు రచించిన ఈ గ్రంథాన్ని వారి దౌహిత్రులు, పాండిత్యాదులలో మూల గ్రంథ రచయితతో సమానులైన, రసహృదయులు శ్రీ యన్. సి. వి. నరసింహాచార్యులుగారు తెలుగులోనికి అనువదించినారు. మూలగ్రంథంలో ఉదాహరించిన శ్లోకాదులకు కూడా బ్రాకెట్లలో తెలుగు అనువాదం ఇవ్వడం కొన్ని విషయాలు పాదిక (Foot-Note) లో ఇవ్వడం, మూలంలో అతి ప్రౌఢంగా ఉన్న భాగాలను సరళభాషలో అనువదించడం వీటిద్వారా అనువక్త శ్రీ నరసింహాచార్యులుగారు విషయజిజ్ఞాసువులైన ఆంధ్ర పాఠకులకు అనుకూలంగా ఉండేటట్లు చేసి ఈ గ్రంథాన్ని అందించారు. దీనిని సంస్కృతభాషా ప్రచారసమితి ద్వారా ప్రచురించి పాఠకలోకానికి అందజేస్తున్నాము. ఇది భవభూతి రూపక రసపిపాసువులకు తృప్తిని ఇవ్వగలరని విశ్వసిస్తున్నాము.

పుల్లెల శ్రీరామచంద్రుడు
కులపతి

హైదరాబాదు
27-12-1993.

# భవభూతిభారతి

## గ్రంథారంభశ్లోకములు

**శ్లో. *1.*** ఈ శ్లోకము శ్లేషాలంకృతము. తన్మహిమతో రెండర్థాలు స్ఫురింపజేసి గ్రంథకర్త ఇష్టదేవతాస్తుతిని, ఆదికవిస్తోత్రమును చేయుచున్నాడు.*

**దేవతాస్తుతి:-** ఏ దేవతాసార్వభౌముడు మునుపు భూమ్యావిర్భావసందర్భమున (భూమి నుద్ధరించుటకై) సూకరత్వమును వహించెనో (వరాహావతార మెత్తెననుట), ఎవ్వని పాదారవిందమునుండి పుట్టిన గంగను చూచినందువలన కవులు (ప్రాజ్ఞులు, జలచరపక్షులును) మహానందమును పొందుదురో అట్టి దేవదేవుడు సర్వోత్కృష్టుడై వెలుగొందుచున్నాడు. (కావున ఆ భగవంతునకు నమస్కరించుచున్నా నని తాత్పర్యము).

**వాల్మీకిస్తోత్రము :-** పండితోత్తముడగు ఎవ్వడు మునుపు (అందరికంటె ముందుగా) (శృంగారకరుణాది) రసావిర్భావవిషయమున సుకరత్వమును వహించెనో, అనగ "క్రౌంచద్వంద్వవియోగోత్థః శోకః శ్లోకత్వమాగతః" అన్నట్లు మధుమయవచనములకు మార్గదర్శియై రసమయకావ్యనిర్మాణమునకు సౌకర్యము కల్పించెనో, ఎవ్వని పద్యములు చూచి చూచి (భావించి) కవులు మహానందము పొందుచున్నారో అట్టి ఆదికవి వాల్మీకి సర్వోత్కృష్టుడై యున్నాడు (కాన ఆ మహర్షికి వందనము లర్పింతునని తాత్పర్యము).

---

* శ్లో. 1. స జయతి రసోద్గమే యత్సౌకర్యం ధురి బభార విబుధేంద్రః
యత్పద్యాలోకవశా ద్వహంతి కవయో మహానందమ్.

శ్లో. 2. ఏ నది విశ్వమునే కొలుచుటకై పూనుకొనిన త్రివిక్రముని చరణకమలమునుండి జనించి భూలోకమునకు అవతరించినదో అట్టి మినువాక అన్నిట మిన్నయైనది. విష్ణుపాదోద్భవయై క్రిందికి జాలువారు ఆ గంగచే హరిచరణము నిర్మితరజతస్తంభావలంబముగా అయినది. అనగ పాదమునుండి ధారగా పడుచున్న గంగాప్రవాహము విష్ణుపాదమునకు ఆలంబమైన వెండిస్తంభము వోలె కనిపించుచున్నది.*

శ్లో. 3. ఆ భాగీరథి తాను జడయైనను (ఇక్కడ ల,డ లకు అభేదము కాబట్టి 'జల' ను 'జడ' గా గ్రహింపవలెను. అనగ జలరూపను జడాత్మనుగా గ్రహింపవలెను). అనగ జడాత్మికగా నుండికూడ లచ్చిమగని యడుగుల నాశ్రయించినందువలన వరశంఖమకర కచ్ఛపపద్మసమిద్ధశ్రేష్ఠములగు శంఖము, మొసళ్లు, తాబేళ్లు, తామరలతో నిండారి వెలుగొందుచున్నది. అవి యన్నియు గంగలో నున్నవని యర్థము. వరశంఖాదిశబ్దములు నిధివాచకములు. వరము (ఒక నిధి), శంఖము, మకరము, కచ్ఛపము, పద్మము అను నిధులతో నిండి ప్రకాశించుచున్నది అని కూడ అర్థము. గంగ ఆశ్రయించిన శ్రీపతిచరణారవిందము కూడ వరశంఖమకరకచ్ఛపపద్మసమిద్ధమే. అనగ రేఖారూపములైన మేలగు శంఖము మకరము కచ్ఛపము పద్మము శ్రీహరిచరణమునందు శోభిల్లుచున్నవి. కావుననే చరణధర్మము చరణాశ్రయ యగు గంగయందు సంక్రమించినది అని చమత్కారము. జడబుద్ధిగా నుండియు గంగ నిధులు సంపాదింపగలుగుట అబ్బురమే. (అయినను ఇం దాశ్చర్యపడవలసిన దేదియు లేదు) సత్యమే. పురుషోత్తముని సాంగత్యము ప్రయోజనకారి కాకుండునా? మందప్రజ్ఞుడు సిరిగలవాని పదముల నాశ్రయించి ధనవంతు డగును. పురుషోత్తమసంబంధము వమ్ము కాదు. అను లోకవృత్తాంతమిట వ్యంజితము. "వరశంఖ ..."ఈ విశేషణము మూడు తీరుల భావము బోధించుట గమనింపదగినది.*

శ్లో. 4. ఈ దినములలో మిక్కిలిగా ప్రసిద్ధివడయలేని

---

* శ్లో. 2. సా జయతి విశ్వమాతుః పాదాంభోజాద్భవం గతా గంగా,
భవతి యయా కృతరజతస్తంభాలంబో హరేశ్చరణః.

* శ్లో. 3. వరశంఖమకరకచ్ఛపపద్మసమిద్ధా జడాప్యభాద్గంగా,
శ్రీపతిచరణాశ్రయణాత్; పురుషోత్తమసంగతిః క్వ నార్థాయ.

మాటల కూర్పరులగు ఇతరకవు లెందరో ఉందురుగాక ! కాని ఎవ్వడు వసుధా[శవణమునందుండి (వసుధా[శవణశబ్దము శ్లిష్టము) పుట్టలో వసించి వసుధా[శవణమున, భూలోక[శవణమున, అనగ భూలోకవాసుల చెవులందు, మకరందధారవంటి వాణిని వర్షించెనో ఆతడే (ఆదికవి వాల్మీకియే) సర్వోత్కృష్టుడు.*

శ్లో. 5. ఈ భువనమున ఎందరెందరు కవులు చిత్రవిచిత్రవర్ణనా భంగిమలతో కవిత అల్లుట లేదు. అహో! కాని, వారెవ్వరును భవభూతి కాలేరు. మణులన్నియు కౌస్తుభము కాగలవా?*

శ్లో. 6. ఈ శ్లోకములో శ్లేషకల్పితచమత్కారము కడు ఆస్వాద్యము. ఇందలి 'శుద్ధగుణోదారపక్షపాతానామ్' అను పదము హంసీనాం, మహిళానాం, గిరాం, సతామ్ అను నాలుగు విశేష్యములకు విశేషణముగా అన్వయింపవచ్చును. శుద్ధగుణోదారపక్షపాతలైన అనగ తెల్లదనమనెడి గుణముచేత గొప్పవైన రెక్కలతో నెగురునట్టి హంసాంగనల గంభీరమైన పదపద్ధతి - వయ్యారపునడలతీరు, శుద్ధగుణోదారపక్షపాతలైన - నిర్మలగుణ శోభితలును ఉదారగుణపక్షపాతముగలవారును అగు మహిళలయొక్క నడల హొయలు, అట్లే శుద్ధగుణోదారపక్షపాతముగల, అనగ దోషాస్పృష్టములైన ప్రసాదాదికావ్యగుణములందును అర్థగౌరవాత్మకమగు ఉదారగుణమునం దును అధికాదరముగల కవివాక్కులును, శుద్ధగుణోదారపక్షపాతులగు - నిర్మలగుణములందు సమధికాదరము గల సత్పురుషుల హృదయముల నాకట్టుకొనును.*

శ్లో. 7. ఈ సంసారమునందు (ఈ లోకమున, ఈ జన్మయందే) మధురార్థమగు కవిసూక్తి సహృదయహృదయముల రంజిల్లజేయగలుగుచో,

---

* శ్లో. 4. అనతిప్రథితవచస్కా స్సంత్వితరే సాంప్రతం కవయః,
స జయతి మరందధారాం వసుధా[శవణే వవర్ష యో వాణీమ్.

* శ్లో. 5. కతి కతి భువనే కవయః కవయంతి న చిత్రవర్ణనాభంగీమ్,
న హి తే భవభూతి రహో న హి మణయః కౌస్తుభ స్పర్ధే.

* శ్లో. 6. పదపద్ధతిర్గభీరా శుద్ధగుణోదారపక్షపాతానామ్,
హంసీనాం మహిలానాం గిరాం చ హృదయం సతాం హరతి.

మీరే చెప్పుడు, బహుక్లేశసాధ్యమైన నిశ్శ్రేయసమున (మోక్షమున) సుఖ మేమున్నది? అది యేపాటిది? మోక్షానందముకంటె కావ్యానందము సులభతరము, స్వాద్యతరము ననుట.*

శ్లో. *8.* చల్లనై తాప ముపశమింపజేయునదై విబుధుల (దేవతల, పండితుల) మానసముల తనియజేసెడి సుధాలహరియు కవీశ్వరుల సూక్తియు మాత్రమే రసైకజీవాతువు రసరూపమైన ముఖ్యజీవనౌషధము, ఈ లోకమందలి సాటిలేని సంజీవని.*

శ్లో. *9.* ఎవ్వడు తానై కవితను వరించునో, అతడు తనను సుభగుడ నని అభిమానముతో తలచువాడుగనైనను ఉండవలెను. లేదా పాదయుగముతోడి పశువుగానైన నుండవలెను. కాని ఎవ్వానిని కవితయే స్వయముగా వరించునో అతడే కవిసముదాయమున ఉత్తముడు.*

శ్లో. *10.* ఈ శ్లోకమున శ్లేషగతచమత్కారము రస్యము. భావరమ్యయై సరసగతి గలదై అలంకారశోభితయై కలాకుశలయై నర్మోక్తిచతురయైన వనిత స్వయముగ నెవ్వని శయ్య జేరునో ఆతడు (ప్రియుడు) మిగుల ధన్యుడు. ఆ వనితవలె భావసంభృతయై సరసగతి నొప్పారునదై శబ్దార్థాలంకారభూషితయై కళలతో నలరారునదై ఉక్తిచతుర యగు ఎవ్వని కవిత శయ్యను - ప్రశస్తమైన పదముల పరస్పరసౌభ్రాత్రరూపమగు పొందికను స్వారసికముగ పొందునో ఆతడు (కవి) ధన్యుడు. ఈశ్లోకభావమును భావన చేయునపుడు 'కవితా వనితా చైవ స్వయమేవాఽఽ గతా వరా, బలాదాకృష్యమాణా తు సరసా విరసా భవేత్' అను శ్లోక మనుసంధింపదగును.*

---

* శ్లో. 7. మధురార్థా కవిసూక్తిర్మదయతి యది మానసం భవే వదత,
అతికృచ్ఛ్రసాధనీయే కిమస్తి నిశ్శ్రేయసేఽపి సుఖమ్.

* శ్లో. 8. శిశిరా నిరస్తతాపా మదయంతీ మానసం చ విబుధానామ్,
అమృతలహరీ కవీశ్వరసూక్తిశ్చ రసైకజీవాతుః.

* శ్లో. 9. కవితాం వరయతి యోఽసౌ సుభగమ్మన్యోఽథవా స్వయం నృపశుః,
కవితా వరయతి యం పున రేష వరో భవతి కవిసార్థే.

* శ్లో. 10. సాకూతా సరసగతి స్సాలంకారా కలావతీ చతురా,
కవితా యస్య తు శయ్యాం వనితేవ భజత్యయం ధన్యః.

శ్లో. *11.* ఎవ్వడు జగన్నాథపండితరాయలవలన భయగ్రస్త యగు చిత్రమీమాంసను కాపాడెనో, అట్టి శ్రీవత్సగోత్రజుడైన చండమారుతాచార్యుడను నా మిత్రవర్యుడు సర్వజనశ్లాఘ్యుడై యున్నవాడు. (చండమారుతాచార్యుడు చిత్రమీమాంసాఖండనమునకు ఖండనము రచించెనని తెలియుచున్నది.)*

శ్లో. *12.* పైన బేర్కొనిన నా మిత్రుడును నేనును పందె మొడ్డి ఆడుకొందుము. ఆ యాటలో విజయము నిలుకడ లేక, త్రాసుతట్టలో పెట్టిన బరువును బట్టి ఒకసారి యటు మరొకసారి యిటు మ్రొగ్గుచూపెడి త్రాసుకొనవలె ఒకపరి యతనిపైనను వేరొకమారు నాపైనను వ్రాలుచుండినది.*

శ్లో. *13.* దోషములు (చాడీలు) చెప్పెడివా డొక్కడు తన నోట తీక్ష్ణమగు ముల్లుగలిగి దానితో పరుల మిగుల నొప్పించును. అట్టివాడు దోమయా లేక కొండెకాడా యని మేమిట తెలియలేకయున్నాము.*

శ్లో. *14.* ఈ ఖలులు విరసులై కర్ణకఠోరముగ మాటాడువారై తమ రజోగుణముతో లోకమును మలినపరచుచున్నారు. ఖరములును (గాడిదలు) మొరటుతనము గలవై కర్ణకఠోరముగ శబ్దించునవై (ఓండ్రపెట్టునవై) పొరలుచు రజస్సుతో (దుమ్ముతో) తనను, ప్రదేశమును మలిన మొనర్చును. (కావున కొండెగాడు (ఖలుడు) గార్దభము నొక్కటే.) కాబట్టియే సారాసారవివేకులగు పెద్దలు 'ర' 'ల' లకు (రేఫలకారములకు) అభేదము వాటించిరి. అట్లగుట ఖల - ఖరములకు అనగ కొండెగాండ్లకు గాడిదలకు

---

* శ్లో. 11. జయతి మమ మిత్రధేయం వాత్స్యశ్రీచండమారుతాచార్యః,
పండితరాజత్రస్తా యేన త్రాతాఽర్థచిత్రమీమాంసా.

* శ్లో. 12. పణబంధకేళివిజయః పర్యాయేణాఽఽవయోః స్థితో జయతి,
గరిమారోపవిశేషా దభితఃప్రవణ స్తులాగ్రభాగ ఇవ.

* శ్లో. 13. కర్ణేజపస్తు కశ్చిత్తుదతి వహన్ నిష్ఠురం ముఖే శూకమ్,
న వయమిమ మత్ర విద్మః కిం స్యాన్మశకోఽథవా పిశునః.

భేదము లేదని సిద్ధించినది.)*

శ్లో. *15.* కవివాణి అన్యోన్యవిరహకాతక. ఒండొంటి విరహ మోర్వలేని పదముల కూర్పుగలది. 'పదానాం పరాఽన్యోన్యమైత్రీ' అనినట్లు 'పదానాం సౌభ్రాత్రం' అన్న చందాన, పదములలో ఏ ఒక్క పదమును తీసివేసినను కవిత్వమే చెడిపోవును. ఏకపదవియుక్తములగు ఇతర పదములు నిస్తేజములగును. అట్లగుట మైత్రీభూషణ యగు నా వాణికి గూడ దుర్భగులగు ఖలుల మాటల మూలమున (దుర్వ్యాఖ్యామూలమున) భయమును శంకించుచున్నాను. "ఊరక సజ్జనుం డొదిగియుండిననైన దురాత్మకుండు నిష్కారణ మోర్వలేక యపకారము చేయుట వాని విద్యగా" అనినట్లు ఖలులు ఎంతో మైత్రిగా ఉన్నవారిమధ్య అంతఃకలహములు పుట్టింపగలరు కాబట్టి పరస్పరగాఢమైత్రితో మెలగెడి పదములకుగూడ వారి మాటలవలన ఎట్టి ముప్పు వాటిల్లునో యని కవి శంకించుచున్నాడు.*

శ్లో. *16.* మేము వాగనుశాసనరసజ్ఞులము గాము. పదార్థశిక్షాశాస్త్రప్రవీణులము గాము. ప్రాబలుకుల మర్మము చర్చింపగల ప్రోడల మంతకంటె కాము. అనగ, వ్యాకరణశాస్త్ర మెరిగినవారము కాము. న్యాయశాస్త్రాధ్యయనము చేసినవారము కాము. మీమాంసావిదులము కాము. అట్లుండ మేమేమి చెప్పగలము.*

సరసపు పలుకుల విలాసముల యావిర్భావముచేత సకలసహృదయ హృదయముల రంజిల్లజేయగల మహాశయులారా! ప్రియమిత్రమహోదయులారా! మిత్రప్రజ్ఞామాత్రముచేత కొలదియగు శబ్దార్థములను తెలిసినవారమే అయినను మేము మీబోంట్లకు, వైజయంతీమాలాధారియగు వైకుంఠునకు గన్నేరుపూల మాలనువలె దోషకలుషితమైన కొరగాని ఈ

---

* శ్లో. 14 రజసైవ దూషయంతో రూక్షాః కటువాదినః ఖలా యదమీ,
రలయో రభేదవాద స్తత్సారజ్ఞై ర్బుధై ర్జగణే.

* శ్లో. 15. సంభావయామి దుర్భగఖలజనవచసో గిరోఽపి భయమ్,
అన్యోన్యవిరహకాతరపదబంధా యత్కవేర్వాణీ.

* శ్లో. 16. న వయం పదానుశాసనరసికా నాప్యర్థశిక్షణప్రవణాః,
మీమాంసేమహి జరఠాం న చ వాచం శక్నుమః కథం గదితుమ్.

మా వచనావలిని కానుకగా సమర్పించుచున్నాము. అందు ఆదరము చూపెడు మీరు స్నిగ్ధజనులయెడ నుండెడు సహజదాక్షిణ్యముచేతగాని, మహాకవివాణీ గుణశ్రవణలోభముచేత గాని, (నా మాటలందు) దొసగులు పొసగియుండుట నీసడింపక గుణలేశాస్పదమగుటను కొనియాడుచున్నవారై మాబోటి మందమతులను ప్రోత్సహింతురుగాక యని మిక్కిలి కొనియాడు చున్నాము.

పండితులతోడను, పామరులతోడను క్రిక్కిరిసియున్న ఈ జగము నందు శాస్త్రార్థములను నిర్ణయింపగలిగియుండుటచేతను, పురుషార్థములను సాధించుటలోని పాటవముచేతను పామరులకంటె పండితులే మేలైనవారని యందరును తెలియుదురు. కావుననే 'నరత్వం దుర్లభం లోకే' (లోకమందు నరత్వము దుర్లభము) 'దుర్లభో మానుషో దేహః' (మానుషదేహము దుర్లభము) మున్నగు వచనములచేత తిర్యగ్జాతులకంటె నరులు మేలని ప్రశంసింపబడుచున్నారు. ఆ మానవులయందును, సంస్కృతభాషయే భాషాంతరములకు మూల మనియు, అది యెల్లభాషలకు జనని యనియు, ద్వీపాంతరవాసులగు నాస్తికులచేతగూడ అంగీకరింపబడియుండుటచేత అట్టి సంస్కృతభాషాభిజ్ఞులు అన్యభాషల నెరిగినవారికంటె శ్రేష్ఠులు. ఆ యా సంస్కృతవాణిని గొనియే భాషాంతరము లుజ్జీవించుచున్నవి. ఆ యా భాషానుశాసనములందు (వ్యాకరణాదిశాస్త్రములందు) ఇందు చెప్పనిదంతయు గీర్వాణభాషానుశాసనమునందువలెనే యని యనుట అనగ "ప్రకృతియాగము వలెనే వికృతియాగము చేయవలెను" అనునట్లుగ 'అతిదేశన్యాయము' నుపదేశించుటే అందులకు ప్రథమనిదర్శనము. కావుననే దర్శపూర్ణమాసాదియాగములకు వలె సంస్కృతభాషకు ప్రకృతిత్వము తెలియుచున్నది. ఇంద్రాగ్న్యాదులకువలె ఇతరభాషలకు వికృతిత్వము స్పష్టము. "స్వాధ్యాయోఽధ్యేయః" అని వేదాధ్యయనము వేదవిహితము. ఆ వేదములు సంస్కృతమయములు. కావున సంస్కృతాధ్యయనము నిగమచోదితమే. మరియు, చెరకు భక్షించుటవలన కలిగెడు ఆనందముతోబాటు వేతనముగూడ లభించినట్లు (జ్ఞానవిజ్ఞానములతో బాటు) వేదచోదితాధ్యయనాదిజన్యమగు పుణ్యముకూడ దక్కుట మహాలాభము.

వైదిక మనియు, లౌకిక మనియు ద్విరూపమగు సంస్కృతభాషకు లక్ష్యరూపమనియు లక్షణరూపమనియు ప్రస్థానద్వయము ఖ్యాతమై యున్నది. అందు మొదటిదైన లక్ష్యప్రస్థానమునకు చెందినవి శ్రీరామాయణ మహాభారత మాలతీమాధవీయాదులు. శబ్దానుశాసనాదులు (వ్యాకరణము

మున్నగునవి) రెండవదగు లక్షణప్రస్థానమునకు చెందినవి. ఈ రెండు తీరుల ప్రస్థానములందు లక్ష్యముల పూర్వకాలికత్వము, లక్షణముల ఉత్తరకాలికత్వము ధర్మిగ్రాహకప్రమాణసిద్ధము. పూర్వసిద్ధలక్ష్యములకే లక్షణములు చెప్పవలసి యుండుట సర్వాంగీకృతము. లక్ష్యములు లేనిచో లక్షణముత్పన్నము కాదు. రామాయణాదికావ్యములను జూచియే కావ్యలక్షణగ్రంథములు రచింపబడినవి. కాగ, లక్షణగ్రంథముయొక్క ఉనికియే తనకంటె ముందుగ లక్ష్యగ్రంథముల ఉనికిని సూచించును. దీనినే భగవత్పతంజలి "కే శబ్దములకు?" లౌకికములకును వైదికములకును. అందు లౌకికశబ్దములు గౌః అశ్వః పురుషః హస్తీ శకునిః మృగః బ్రాహ్మణః అను నిట్టివి. వైదికములు [1] "శం నో దేవీ రభిష్టయే" అనునవే కదా - ఇత్యాదిగ వ్రాయుచు మునుపు ఉన్నట్టివేయగు లౌకిక వైదిక భేదభిన్నములగు రెండురీతుల శబ్దములకు లక్షణము ననుశాసింతునని ప్రతిజ్ఞ చేసినాడు.

అట్లే వాత్స్యాయనాదులును లక్షణములు చెప్పుట కనువుగా స్త్రీలను గాని పురుషులనుగాని సృష్టింపలేదు. అంతకుమునుపే సృష్టింపబడినవారే 'పద్మిని' మున్నగు పేర్లతో సలక్షణముగ నిరూపింపబడినారు. ఆ తీరుననే శాలిహోత్రుడు మున్నగు అశ్వశాస్త్రనిర్మాతలచేతను అశ్వములు లక్షణములను బట్టి సృష్టింపబడలేదు. అంతకు పూర్వమే సిద్ధమైయున్నవే శరీరపువర్ణము, గంధము, గతి, కంఠస్వరము, వంశము, దేశములను నిరూపకములనుగా గొని వేర్వేరుగా నిర్దేశింపబడుచున్నవి.

పెక్కుమాట లేల? అపౌరుషేయమగు (వేద) వాక్కుగూడ ఉత్పత్తి రహితములై నిత్యములైన చిత్తు, అచిత్తు, ఈశ్వరుడు అనెడు తత్త్వత్రయము యొక్క స్వరూపము, స్థితి, ప్రవృత్తి మున్నగువాని నుపదేశించుచున్నదే గాని ఆ తత్త్వములను పుట్టించుట లేదు. అదెట్లనగా - ప్రకృతివిషయమున [2] 'అజామేకాం లోహితశుక్లకృష్ణాం బహ్వీం ప్రజాం జనయంతీం సరూ

---

[1] దేవతారూపములగు (జలములు) సుఖకరములగుగాక, యజ్ఞముకొరకై అగుగాక! ఋగ్వేదము 10-9-4.

[2] అజ యనగ పుట్టుపులేని మూలప్రకృతియగు మాయ. అది ఒక్కటే. రజ స్సత్త్వతమోగుణాత్మిక. ఇట్టి ప్రకృతి దేవతిర్యఙ్మనుష్యాదిరూపమైన, గుణత్రయాత్మక మగుటచేత తనతో సమానరూపము గల బహుభంగుల ప్రజను పుట్టించుచున్నదానిని - మహానారాయణోపనిషత్తు - 8-4.

పామ్' అనియు, ఆత్మవిషయమున [3] 'అజో౽హ్యేకో జుషమాణో౽నుశేతే జహాత్యేనాం భుక్తభోగా మజో౽న్యః' అనియు, పరమాత్మవిషయమున[4] 'న చా౽స్య కశ్చిజ్జనితా' అనియు చిదచిదీశ్వరతత్త్వములను వేదము వర్ణించుచున్నది. కావున '[5] దండాపూపికాన్యాయమున' ఇతరలక్షణగ్రంథములకును లక్ష్యవిమర్శనమే ముఖ్యకృత్యమైనందున లక్ష్యపూర్వకత్వము సిద్ధము. అట్లగుటచే లక్షణగ్రంథములకు లక్ష్యాంగత్వమును కాదనలేము. అట్టి లక్ష్యములు కావ్యనాటకాదులే.

కొందరు లోకవ్యవహారమందు వచ్చిపడిన శబ్దములకును, అర్థములకును లక్ష్యత్వము యుక్తము. కావ్యములకు లక్ష్యత్వము లేదని తలచుచున్నారు. అది అయుక్తము. వారి యభిమతమును సాధించుకొనుటకు అనుకూల ప్రమాణము లేదు. లక్షణాదులకు కావ్యాంగత్వము "న తచ్ఛాస్త్రం న తచ్ఛిల్పం న సా విద్యా న సా కలా, జాయతే యన్న కావ్యాంగమతో

---

[3] అజః అనగ పుట్టుకలేని జీవుడు. అతడు రెండు తెరగులవాడు - ఆసక్తుడు, విరక్తుడు. వీరిరువురిలో ఆసక్తజీవుడు పై జెప్పిన మాయను సేవించువాడై అనుసరించుచు సంసారబంధమును పొందుచున్నాడు. విరక్తజీవుడు మును పే అనుభవించి తత్త్వజ్ఞానము కలుగగా ఆ మాయను దూరమున వదలి వేయుచున్నాడు.

మహానారాయణోపనిషత్తు - 8-4

[4] ఈ పరమాత్మకు ఉత్పాదకుడు లేడు. -శ్వేతాశ్వతరోపనిషత్తు - 6-9

[5] దండాపూపికాన్యాయము - దీనినే కైముతికన్యాయమనియు చెప్పవచ్చును. (దండము=కర్ర, పుల్ల. అపూపిక (అందుగ్రుచ్చిన) = భక్ష్యము) ఒకడు గారెవంటి భక్ష్యములను ఒక కర్రకు గ్రుచ్చి చూరులో పెట్టినాడట. మరునాడు గారెలు తెమ్మని భృత్యుని ఆదేశించినాడట. ఆతడు చూచి వచ్చి 'దండో౽పి భక్షితో మూషికైః' అని బదులు పలికినాడట. గారెలు గ్రుచ్చిన పుల్లను గూడ (గారెల వాసనకు) ఎలుకలు తినివేసిన వనగా గారెలను తినివేసినవని చెప్పవలసిన పని యేమున్నది? నిస్సారకఠినమగు కర్రనే ఎలుకలు నమలివేసిన వనగా, గారెలను (మెత్తనివి, రుచ్యములు) తినిన వనుట చెప్పకయే సిద్ధించును. ఒక విషయమును ప్రతిపాదింపగా (దాని ప్రభావముచేతనే) వేరొక విషయము ప్రతిపాదింపకయే సిద్ధించునపుడు దానిని దండాపూపికాన్యాయసిద్ధమని చెప్పుదురు.

భారో మహాన్ కవేః" [శాస్త్ర-శిల్ప-విద్యా-కలాదులలో కావ్యాంగము కానిది లేదు; అన్నియు కావ్యాంగములే యనుట. కావుననే, ఇవన్నియు తెలిసియే కావ్యరచన చేయవలసియుండుటచే కవికి చాల పెద్దబరువు.]

"కావ్యాలాపాంశ్చ వర్జయేత్" (కావ్యప్రవచనము విడువ వలెను) అను నిషేధవచనముచే కావ్యములు పఠింపరాని వగుటచేత అనాదరణీయములని సిద్ధించుటవలన, అట్టి నిషిద్ధకావ్యవిషయమున లక్షణకరణము అనుచితము అని చెప్పరాదు. పై జెప్పిన 'కావ్యాలాపాంశ్చ' అను స్మృతివాక్యమునకు - "[6] అభిప్రియాణి కావ్యా విశ్వా ఆచక్షాణః" అనెడి కావ్యనిర్మాణావశ్యకతను బోధించెడు శ్రుతితో విరోధ మేర్పడుచున్నది. [7] "శ్రుతిస్మృతిపురాణానాం విరోధో యత్ర దృశ్యతే, తత్ర శ్రౌతం ప్రమాణం తు తయోర్ద్వైధే స్మృతి ర్వరా" అను ప్రమాణమును బట్టి "కావ్యాలాపాన్..." అనునది స్మృతి; "అభిప్రియాణి కావ్యా..." అనునది శ్రుతి; కావున స్మృతికంటె శ్రుతి ప్రబలప్రమాణము. స్మృతి కిచట ప్రామాణ్యము లేదు. ఈ శ్రుతివాక్యమునకు ఇది విషయ మని మేము నిర్ణయింపము (ఒప్పుకొనము) అనరాదు.[8] 'కావ్యాలాపాశ్చ యే కేచిత్ గీతకాన్యఖిలాన్యపి, శబ్దమూర్తిధరస్యైతే విష్ణోరంశా మహాత్మనః' అనియు,[9] "పురాణసంహితాకర్తా భవాన్ వత్స భవిష్యతి", అనియు వసిష్ఠపులస్త్య వరప్రదానముచేత మహిమోన్నతి పొందిన భగవంతుడగు కృష్ణద్వైపాయనుని (వ్యాసుని) జనకుడైన శ్రీపరాశరుని వచనముచేతను[10] "స్వరూపరూపవిభవగుణ కర్మాణి శార్‌ఙ్గిణః, వ్యాచక్షీత నిబధ్నీయాత్ శృణుయాత్ విలిఖేత్పఠేత్",

---

[6] అభిమతములైన సర్వకావ్యములను చూచుచు పోవుచున్నాడు - ఋగ్వేదము - 9-57-2.

[7] శ్రుతిస్మృతిపురాణవచనములకు విరోధ మేర్పడినచో శ్రుతినే (వేదమునే) ప్రధానప్రమాణమని గైకొనవలెను. స్మృతిపురాణములకు విరోధము సంభవించుచో స్మృతియే ప్రబలప్రమాణము.

[8] అన్ని కావ్యవచనములు, గీతములును శబ్దాత్మకుడగు విష్ణుమూర్తియొక్క అంశములే - విష్ణుపురాణము 1-12-85.

[9] కుమారా, నీవు పురాణసంహితాకర్తవు కాగలవు. - విష్ణుపురాణము 1-1-26.

[10] శ్రీ విష్ణుమూర్తియొక్క ఆనందమయత్వాదిస్వరూపము, సుందరాకారము, ఐశ్వ

"తం ధీరాసః కవయ ఉన్నయంతి" మున్నగు వచనములచేత ఆ వాక్యము కావ్యవిషయకమే యని నిర్ణయించుట యుక్తము.

మరియు కావ్యసామాన్యము (కావ్యజాతి, కావ్యములన్నియు) పరిత్యాజ్యములని ఏ కారణముచేత మనము నిశ్చయింపగలము? కావ్యమనగా ఛందోబద్ధమో, గద్యరూపమో యగు ఒక విషయవర్ణనమే గదా? ఆ కావ్యమందు ఛందోబంధాంశమున దోషమా? లేక గద్యాంశమందా? మరి వర్ణనాంశమందా? మొదటిది (సదోషము) కాదు; ఏలన వేదములందే ఛందోబంధములుండుటచేత ఛందోంశమునకు దుష్టత్వ మాపాదించిన వేదమే పరిత్యాజ్యమగును. రెండవ పక్షము (గద్యాంశమున దోషము)కూడ పొసగదు. 'గా మానయ', "అశ్వం బధాన"(ఆవును తోల్కొని రమ్ము; అశ్వమును కట్టివేయుము) మున్నగు వాక్యములు గద్యరూపము లగుటచేత సకలవ్యవహారములకును భంగము వాటిల్లును. కనుకనే ఈ రెండంశములందును వేదభిన్నత్వవిశేషణము కల్పించినను, అనగ వేదభిన్నమగు గద్యాంశము పద్యాంశము నిషిద్ధము అని కల్పించినను అది ప్రయోజనకారి కాదు. వేదభిన్నములగు [11] "మా నిషాద ప్రతిష్ఠాం త్వ మగమశ్శాశ్వతీ స్సమాః" ఇత్యాదివాక్యములకు దుష్టత్వము సంఘటిల్లును. మూడవ అంశమును బట్టి కూడ (వర్ణన) దుష్టమనరాదు. ఏదేని ఒక పదార్థమందలి స్వభావాభివర్ణనకు దోషహేతుత్వ మెచ్చటను చెప్పబడలేదు. 'కావ్యధర్మాశ్రయమైనదంతయు త్యాజ్యము' అని చెప్పుట పాడి గాదు. ముందే అది ఖండితమైనది. మహాభారతాదులు కూడ కావ్యధర్మాశ్రయములు కాబట్టి, అదుష్టములై ఉపాదేయతమములైన భారతాదులకు గూడ త్యాజ్యత్వము సంభవించును. భారతము కావ్యమా - అను శంకకు తావు లేదు. [12] "భారతశ్శాస్త్రసారోఽయమతః కావ్యాత్మనా

---

ర్యము, ఇతరగుణములు, చేష్టితములను వ్యాఖ్యానింపవలెను. గ్రంథరూపమున నిబంధింపవలెను. వినవలెను. వ్రాయవలెను. చదువవలెను.

[11] ఓయి వ్యాధా! నీవు పెద్దకాలము నిలువలేవు. రామాయణము 1-2-15.

[12] భారతమనగ సకలశాస్త్రర్థసారము. అందువలననే అది కావ్యరూపమున నిర్మింపబడినది. అందుచేత ఇది కావ్యమే యగును.

కృతః--- తస్మాత్కావ్యం భవిష్యతి", "[13] అస్య కావ్యస్య కవయో న సమర్థా విశేషణే" ఇత్యాదివచనములచే భారతమునకు కావ్యత్వము సిద్ధము.

"అనృషికర్తృత్వే సతి కావ్యత్వాత్" ఋషినిర్మితము కాకపోవుటతో బాటు కావ్యత్వాశ్రయమగుట త్యాజ్యతకు కారణమని చెప్పినను తప్పించుకొనలేరు. ఋషినిర్మితములు కాని శాస్త్రములకు గూడ హేయత్వము సంభవించును. కావ్యత్వముతో కూడినప్పుడే అది (శాస్త్రము) హేయమగును, కాన శాస్త్రమునకు (అందు కావ్యత్వము లేనందున) దోషప్రసక్తియుండరాదని తలపరాదు. కావ్యత్వమునకుగాని, అనృషికర్తృకత్వమునకుగాని ప్రత్యేకముగ దోషహేతుత్వము లేనప్పుడు, ఆ రెండు కలిసినప్పుడు ఆ రెండు ధర్మములకు దోషహేతుత్వము చెప్పుట యెట్లు వీలగునో నీవే యాలోచించి చూచుకొనుము. ఇంతియకాక "నాఽనృషిః కురుతే కావ్యమ్" (ఋషికానివాడు కావ్యము నిర్మింపలేడు)ఇత్యాదివచనములచే కవియందు ఋషిత్వ మంగీకరించుటచేత నీ యభీష్టము సిద్ధింపదు. ఇట్లనుటచేత శంకింపబడిన దోషములన్నియు పరిహరింపబడినవి. ఇదంతయు మనమున నిడుకొనియే ప్రాచీనులు "[14] కావ్యం యశసేఽ ర్థకృతే"(కావ్యమువలన యశము ధనము పొందవచ్చును.) ఇత్యాదివచనములచే ప్రపంచించిరి.

[15] "పరివడ్ఢఇ విణ్ణాణం సంభావిజ్జఇ జసో విడప్పంది గుణా"
[పరివర్ధతే విజ్ఞానం సంభావ్యతే యశోఽర్జ్యంతే గుణాః]
(కావ్యమువలన విజ్ఞానము పెంపొందును. కీర్తి కలుగును. గుణము సంపాదింపబడును. )

అనియు-
మీమాంస్యం పునరత్ర కావ్యమమునా సిద్ధ్యంతి కీర్త్యాదయో
దుష్కావ్యం హి నిషేధభాః గితరథా రామాయణాదేః క్షతిః".

(ఇచ్చట కావ్యము చర్చింపదగినదే, దీనివలన కీర్త్యాదులు కలుగును.

---

[13] ఈ కావ్యమును (భారతమును) కవులు మించి వ్రాయుట కసమర్థులు. - భారతము 1-1-98.

[14] కావ్యప్రకాశము - 1-2

[15] సేతుబంధము -

దుష్టమగు కావ్యము నిషేధ్యము. ఇట్లంగీకరింపనిచో రామాయణాదులకును విచ్ఛేదమేర్పడును.) మున్నగు వచనములచేత వివరింపబడినది.

సద్విషయప్రతిపాదకము కాని కాదంబర్యాదికము దుష్కావ్యము. జగత్తులో కావ్యమైనను, కావ్యభిన్నమైనను కానిండు. ఏది సద్విషయకమో అది ఆదరణీయము. ఏది అట్టిది కాదో (అసాధువిషయకమో) అది ఆదరణీయము కాదు - అనునదియే సార్వత్రికమగు వ్యవస్థ. అట్లగుటచేతనే వాత్స్యాయనీయము (కామశాస్త్రము), లోకాయతజినదర్శనాదులు (అవైదికములు) విద్వాంసులచేత ఆదరింపబడుటలేదు. "[16] అపరిగ్రహాచ్చాత్యంతమనపేక్షా" - ఆ అపరిగ్రహము (స్వీకరింపకుండుట) చేతనే అత్యంతనిరాదరణ, ఇత్యాదివచనములచేత నిర్ణయింపబడినది.

పుణ్యశ్లోకవర్ణనాత్మకమగు (పవిత్రచరిత్రుని వర్ణనరూపమగు) కావ్యము దృష్టాదృష్టరూపములగు బహుప్రయోజనములను కలిగించునదిగా నిరూపింపబడినది. ఆలంకారికులు " పుణ్యశ్లోకస్య చరిత ముదాహరణ మర్హతి" (పవిత్రకీర్తిగలవాని చరిత్ర యుదాహరింపదగినది. " నాయకగుణగ్రథితాః సూక్తిస్రజః సుకృతినా మాకల్పమాకల్పంతి" నాయకగుణము లనెడు సూత్రములచే గూర్చబడిన సుకృతాత్ముల సూక్తిమాలికలు కల్పాంతము వరకు ఆభరణములుగా నుండగలవు) . అని నుడివిన రీతిగ విషయగౌరవమే కావ్యపరిగ్రహమునకు హేతువు. వేదమం దున్నవైనను[17] "త్రింశదస్యా జఘనం యోజనాని", [18] "శ్యేనేనాభిచర న్యజేత " మున్నగు మంత్రబ్రాహ్మణార్థవాద భాగమునకును, [19] తదా విద్వాన్ పుణ్యపాపే విధూయ నిరంజనం పరమం

---

[16] బ్రహ్మసూత్రము - 2-2-17

[17] ఈమె జఘనము ముప్పదియోజనములు (ఆమడలు) ఆక్రమించుకొనియున్నది. - కాఠక సంహిత.

[18] శ్యేననామకమగు అభిచారికయాగము చేయవలెను.

[19] బ్రహ్మసాక్షాత్కారమైనప్పుడు, బ్రహ్మనెరిగినవాడై పుణ్యపాపములను తొలగించుకొని, ప్రకృతిసంసర్గరహితుడై జీవుడు పరమాత్మతో (గుణాష్టకావిర్భావముతో) అత్యంత సామ్యము పొందుచున్నాడో, ఆ వస్తువే బ్రహ్మయని తెలియుము.

సామ్యముపైతి' "[20] యతో వా ఇమాని భూతాని జాయంతే, యేన జాతాని జీవంతి, యత్ప్రియన్త్యభిసంవిశంతి, తద్విజిజ్ఞాసస్వ, తద్బ్రహ్మేతి" అను నీ వాక్యములకును వివేకి యెవ్వడైనను సామ్యము చెప్పడు. శ్రుతిసంబద్ధముల గుటచేత సమానములనుట వాఙ్మయత్వాశ్రితము (వాఙ్మయము) లన్నియు సమానములే యన్నట్లు నిష్ప్రయోజకము. కాని విషయతారతమ్యమును బట్టి భేద మచ్చుట (పై వేదవాక్యములలో) నున్న దనినచో, ఇతరత్ర కూడ అది సమానమే. హానోపాదానములకు విషయమే హేతువు.

సద్విషయకము కాకపోయినను కాదంబరిని పరిగ్రహించుట ఇతర గుణప్రయుక్తము. అన్ని యుత్సర్గవిధులకును (సామాన్యవిధులకును) కొన్నిచోట్ల అపవాదముండును. ఆ విషయమునే పద్యద్వయముతో నిరూపించెదము- "కాదంబరీరసజ్ఞానామాహారోఽపి న రోచతే"(కాదంబరీకావ్యగత రసాస్వాదపరులకు ఆహారముకూడ రుచింపదు; 'కాదంబరి' ఒక తీరగు మద్యము. దాని రుచి మరిగినవారికి ఆహారముపై బుద్ధి పోదనియు అర్థచమత్కృతి).

[21] "వైరల్యాదిహ గద్యకావ్యసరణే రస్యైశ్చ భావైర్నవై-
రాస్వాద్యై రుపనేయసమ్మదతయా వక్రోక్తిముఖ్యైరపి,
సందర్భేణ గిరా మగోచరగుణప్రస్తారవిస్తారిణా
బాణోచ్ఛిష్టమభూ జ్జగత్త్రియమితి శ్లాఘ్యైవ కాదంబరీ".

[ఈ కావ్యజగత్తునందు గద్యకావ్యపద్ధతి విరళముగా నుండుటచేతను, నూత్నములై ఆస్వాద్యములగు భావముల చేత వక్రోక్త్యాదులచేత ఆనందసంధాయకమగుటచేతను, మాటల కందని గుణప్రస్తారముచేతను, విస్తృతమైన మాటలకూర్పుచేతను మూడులోకములును బాణోచ్ఛిష్టములైనవి. అట్లగుట ఈ కాదంబరి పరమశ్లాఘ్యము. కావున స్వీకార్యమనుట.]

శ్రుతిసిద్ధములు కాని గుణాలంకారరసాదులగు కొన్ని పదార్థముల

---

[20] పంచభూతములు బ్రహ్మాదిస్తంబ(తృణ) పర్యంతసకలప్రాణులు ఏ వస్తువు నుండి పుట్టుచున్నవో, అటుల పుట్టినవి ఏ వస్తువుచేత జీవించుచున్నవో, దేనివలన నాశమొందుచున్నవో, అట్లయి ఏ వస్తువునందు లయమొందుచున్నవో జగదుత్పత్తిస్థితి లయములకు హేతువైన ఆ వస్తువే బ్రహ్మ యని తెలిసికొనుము.

[21] ఈ శ్లోకము గ్రంథకర్తదేమో యని తోచుచున్నది.

వర్ణనకూడ కావ్యము పరిత్యాజ్యమగుటకు హేతు వేల కాకూడదు? అని కుచోద్యము చేయరాదు. వేదములందు కూడ గుణాలంకారరసాదులు కన్పట్టుచున్నవి. పరిశీలింపుడు - [22] "త్రింశదస్యా జఘనం యోజనాని" మొదలగుచోట్ల అతిశయోక్తి.[23] "ఆ తే గర్భో యోని మేతు పుమాన్ బాణ ఇవేషుధిమ్" మున్నగు స్థలములందు ఉపమ. ఇట్లే వేరగు అలంకారములును స్థలాంతరములందు కనబడుచున్నవి.[24] "అంభస్య పారే భువనస్య మధ్యే నాకస్య పృష్ఠే మహతో మహీయాన్" ఇత్యాదిస్థలములందు పృథక్పదత్వరూప మాధుర్యగుణము (విడి విడి మాటల కూర్పు).[25] "మూర్ధానం పత్యురారోహ ప్రజయా చ విరాడ్భవ"[4] "ఆరోహోరు ముపబర్హస్వ బాహుం పరిష్వజస్వ జాయాం సుమనస్యమానః" ఇత్యాదిస్థలములందు శృంగారము. [26] "త్రిస్రః పురః ఆసన్" మున్నగుచోట్ల వీరాదిరసములు పెల్లుగా లభించుచున్నవి. ఇదిగాక,[27] "రసో వై సః; రసం హ్యేవా஽యం లబ్ధ్వా஽஽నందీ భవతి"- ఈ శ్రుతి జీవునకు రసశబ్దవాచ్యుడగు పరమాత్మతోడి సంసర్గమువలని పరమానందమును ప్రతిపాదించుచున్నది. అట్లే ఆలంకారికులును రసము నొక్కదానినే అసంలక్ష్యక్రమవ్యంగ్యమై సకలకావ్యవర్తి యగు ప్రాణ మనుచున్నారు. అందుచేత వేదాంతులవలె ఆలంకారికులుకూడ రసగ్రహణయోగ్యతవలననే వ్యుత్పత్తికి

---

[22] ఈమెజఘనము ముప్పది యోజనముల విస్తీర్ణము గలది. కాఠక సంహిత - 8-17

[23] బాణ మంబులపొదిలో చేరునట్లుగ పుంరూపగర్భము నీ యోనిని వచ్చి చేరుగాక. - ఏకాగ్నికాండము 1-13-9.

[24] బహువిధసముద్రమధ్యవర్తి జలములయొక్క ఆవలిగట్టున పెద్ద లోకాలోకపర్వతాదికము; అంతకంటె మహత్తరుడు పరమేశ్వరుడు.

[25] (భర్త తలపై నెక్కుము.) ప్రధానవ్యక్తి వగుము. - ఏకాగ్నికాండము - 1-6-5

[26] తొడపై నెక్కుము - బాహువు చాచుము - భార్యను ఆలింగనము చేసికొనుము - ఏకాగ్నికాండము 1-12-1.

[27] ఆ పరబ్రహ్మ రసస్వరూపుడే. ఆ రసమును పొంది ఆనందించువాడగుచున్నాడు. తైత్తిరీయోపనిషత్తు - 2-7.

పరిపూర్ణత నంగీకరించుచు వాఙ్మయమునకు రసైకనిష్ఠత్వమును నొక్కి వక్కాణించుచున్నారు. అన్నియెడలను సామ్యముండగా శ్రోత్రియపుత్రుడు (ఛాందసుడు)దోషహేతువు నిచ్చుట మాత్రమే ఏల సాక్షాత్కరించుకొనుచున్నాడో తెలియలేకున్నాము. మహాకవి సరస్వతీ రసాస్వాద కుతూహలమున సంబరపడు చిత్తము గలట్టి సహృదయులకు వైరస్యము గలిగించునట్టి అకుశలకలహకూలముల నొరసికొను వచనముల రచనాకుతూహలము ఇక చాలును. వాగ్వాదములు మాని విషయమును చర్చించుకొందము.

ఈ విధముగ రసైకజీవనములగు కావ్యములు నిర్మించువారే మహాకవులు. దీనినే అభినవగుప్తాచార్యుడు-

"[28] వాగ్రూపయైన సరస్వతీదేవి అతిమధురమైన వస్త్వలంకారరసము లందున్నట్టి సారభూతమగు దివ్యానందరసమును స్వయముగ స్రవించుచున్నదై మహాకవులయొక్క, అలోకసామాన్యమగు ప్రతిభావిశేషమును, అనగ అపూర్వవస్తునిర్మాణసమర్థమగు ప్రజ్ఞయొక్క రససాక్షాత్కారసంబంధివైశద్యసౌందర్య సంభృత దివ్యకావ్యనిర్మితిక్షమతారూపమగు విశేషమును స్ఫురించునట్లుగ అభివ్యక్తము చేయుచున్నది. అనగ, రసావేశమునకు ప్రతిబంధకమగు ఆవరణను తొలగించెడి యభివ్యంజనచేత సహృదయులగు జ్ఞాతలకు ప్రత్యక్షగోచరమగుచున్నట్లు చేయుచున్నది" అని ప్రపంచించినాడు. సూత్రవృత్తియందు ఈ కవిశబ్దము, "కౌతి శబ్దాయతే విమృశతి రసభావాన్" (కౌతి=పలుకుచున్నాడు, రసభావాదులను విమర్శించుచున్నాడు) అనెడు వ్యుత్పత్తిచొప్పున రసికులను రంజింపజేయజాలునట్టి శబ్దార్థముల ప్రయోగమర్మజ్ఞునియందు ప్రయోగార్హమగుచున్నది. ఆ 'కవి' శబ్దముపై ష్యఞంతముగా నిష్పన్నమైన కావ్యశబ్దము గుణాలంకారపరిష్కృతములై దోషాస్పృష్టములై రసప్రవణములైన శబ్దార్థములయందు వర్తించును.

ఇట కొందరు - "కావ్యం శ్రుతమ్, అర్థో న జ్ఞాతః", "కావ్యాదర్థోఽవగమ్యతే" (కావ్యము వినబడినది, అర్థము తెలియబడలేదు, కావ్యమునుండి అర్థము తెలిసికొనబడుచున్నది) మొదలగు నిత్యవ్యవహారము చేత శబ్దమాత్రమునందే కావ్యవ్యవహారము ననుసరించువారై- "రమణీయార్థ

---

[28] సరస్వతీ స్వాదుతదర్థవస్తు నిస్యందమానా మహతాం కవీనామ్,
అలోకసామాన్యమభివ్యనక్తి పరిస్ఫురంతం ప్రతిభావిశేషమ్.
(ధ్వన్యాలోకము - 1-6)

ప్రతిపాదక శ్శబ్దః కావ్యమ్" (రమణీయమైన అర్థమును బోధించెడు శబ్దము కావ్యము) అని లక్షణము చెప్పుచున్నారు. వారికి "తదదోషౌ శబ్దార్థౌ కావ్యమ్" [నిర్దుష్టమైన శబ్దార్థములు (రెండును) కావ్యము] మున్నగు ప్రాచీనాలంకారికలక్షణములతో విరోధము వాటిల్లును.

మరియు, కావ్యాంగములగు గుణములకును, అలంకారములకును, దోషములకును శబ్దార్థములు రెండును ఆశ్రయము లని అంగీకరింపబడి యుండుటచేతను, శబ్దార్థములు (విడివడి) వేర్వేరుగ నుండనివగుటచేతను, కావ్యజ్ఞుడు (అర్థపరము), కావ్యాధ్యాయి (శబ్దపరము) వంటి వ్యవహారములు శబ్దార్థోభయవిషయములుగా కనిపించుటచేతను, భేదవ్యవహారము లాక్షణిక మని ఉపపత్తియుండుటచేతను శబ్దార్థయుగళమే కావ్యశబ్దవ్యవహారార్హము. ఈ విషయ మంతయు మా మిత్రవర్యుడగు కవికులశిరోమణియైన పండిత చండమారుతాచార్యునిచేత చిత్రమీమాంసావివరణమందు చక్కగా వివేచితమైనది.

"[29] శక్తి ర్నిపుణతా లోకశాస్త్రకావ్యాద్యవేక్షణాత్,
కావ్యజ్ఞశిక్షయాఽభ్యాస ఇతి హేతుస్తదుద్భవే".

అను శ్లోకముచేత అట్టి కవితాసముల్లాసమును కూర్చి, శక్తివ్యుత్పత్తి అభ్యాసములకు హేతుత్వము ప్రాచీనాలంకారికులచేత ప్రతిపాదింపబడినది. ఇచ్చట లోకము, శాస్త్రము మున్నగువానిని చక్కగా అవగాహన చేసికొనుటచేత కలిగిన నిపుణతయే వ్యుత్పత్తి యనబడుచున్నది. "[2]త్రితయ మిదం వ్యాప్రియతే శక్తి ర్వ్యుత్పత్తి రభ్యాసః" ఇత్యాదిస్థలములందు పలువురు ఆలంకారికులచేత తత్స్థానమున ('నిపుణతా' శబ్దమునకు బదులుగా) వ్యుత్పత్తిపదమునే ప్రయోగించియుండుటచేతను తానుకూడ (మమ్మటుడు) అట్లే వ్యాఖ్యానించియుండుటచేతను ఈ యర్థము సిద్ధించుచున్నది.

ఇచ్చట కూడ కొందరు 'ప్రతిభ' అను పర్యాయపదము గల శక్తియే కవితాసమున్మేషహేతువని పలుకుచు మిగిలిన రెండింటికిని (వ్యుత్పత్త్యభ్యాసములు) ఆ ప్రతిభలో విశిష్టతను కూర్చుటయే కృత్యమని వర్ణించుచున్నారు.

ప్రాచీనులు "హేతు ర్న తు హేతవః"అనుచు ప్రతిభావ్యుత్పత్త్యభ్యాస

---

[29] కావ్యప్రకాశము - 1-3

ములు మూడును హేతువు, హేతువులు కావు; [భాషాసంప్రదాయమును బట్టి హేతువు అను ఏకవచనాంతశబ్దము మూడును కలిసియే (ఒక) హేతువు అగును అని బోధించును. హేతవః అని యుండినచో ఆ మూడును ప్రత్యేకప్రత్యేకముగ హేతువులు అను భావ మేర్పడును. అప్పు డా మూడింటిలో ఏ ఒక్కటున్నను కావ్య మావిర్భవించును అను దుర్భావన యేర్పడును.] మూడును కలిసియే కావ్యకారణ మగును కాని వేర్వేరుగా కారణములు కానేరవు అని చెప్పిరి. ప్రతిభకు (శక్తికి) కేవలకవితోత్పత్తినిగూర్చి కారణత్వ మంగీకరించినను, చారుతమకావ్యమే లక్షణోక్తిపూర్వకముగ నిరూపిం పదలపబడినది కావున, అట్టి కావ్యావతారమున ఆ మూడిటికి కార్యకారిత్వము నిర్ణయించుచున్నాము. అట్లు కానిచో చారుతాభంగ మేర్పడును. మూటికి కారణత్వ మంగీకరించిననే ఆ రెంటికి (వ్యుత్పత్త్యభ్యాసములకు) సార్థకత యేర్పడును. ఈ విషయమే 'కావ్యాలంకార' మను గ్రంథమున నిట్లు సూచింపబడినది -

"[30] తస్యాసారనిరాసా త్సారగ్రహణాచ్చ చారుణః కరణే,
త్రితయ మిదం వ్యాప్రియతే శక్తి ర్వ్యుత్పత్తి రభ్యాసః." అని.

[అసారమును వదలుట, సారమైనదానిని గ్రహించుటద్వారా మనోజ్ఞతమకావ్యనిర్మాణమునందు శక్తి, వ్యుత్పత్తి, అభ్యాసము - అనెడి ఈ మూడును కార్యకారులగుచున్నవి. మునుపు నిర్వచించిన వ్యుత్పత్తిమహిమచేత అసారపరిహార సారస్వీకారయోగ్యత సిద్ధింపగా అభ్యాసము ప్రతిభకు పదును పెట్టును. అప్పుడు సాధుకావ్య మావిర్భవించును. రసోల్లసిత చారుతర కావ్యనిర్మాణానుకూల శబ్దార్థయుగళోపస్థితి శక్తివలననే కలుగును.]

శక్త్యాదిత్రితయలక్షణ మందే కాననగును, తిలకింపుడు-

"[31] మనసి సదా సుసమాధిని విస్ఫురణ మనేకధాఽభిధేయస్య,
అక్లిష్టాని పదాని చ విభాంతి యస్యా మసౌ శక్తిః".

[ఏది యుండగా ఏకాగ్రతగల చిత్తమునందు ఎల్లప్పుడును వాక్యార్థము (ప్రతిపాద్యాంశము) నానాభంగుల విస్ఫురణ చెందునో, అనుకొనిన

---

[30] రుద్రట కావ్యాలంకారము - 1-24

[31] రుద్రట కావ్యాలంకారము - 1-15

అర్థమును బోధింపగలట్టి శబ్దములు గూడ తమంతట భాసించునో, అనగ దేని మహిమతో లోకోత్తర చమత్కారజనక కావ్యనిర్మాణానుకూల నానావిధ శబ్దార్థములు అయాచితోపపన్నములై స్ఫూర్తములగునో అదియే శక్తి. ]

పై శ్లోకమున 'సుసమాధిని' అనుటచేత "[32] అవహితం హి చిత్తమర్థాన్ పశ్యతి" [అవధానప్రసన్నమగు చిత్తమే అర్థములను చక్కగా చూడ గలుగును.] అను వామనుని భావము వివక్షితము. 'సదా' అనుమాట భావగర్భితము. "[32] రాత్రియామ స్తురీయః కాలః"[రాత్రి నాలుగవ జాము కవితకు అనుకూలము] అని వామనుని వచనము అసమగ్రశక్తిగల కవివిషయమని గ్రహింపవలెను. 'అనేకధా విస్ఫురణమ్' అనుటచేత - "ప్రజ్ఞా నవనవోన్మేషశాలినీ ప్రతిభా మతా" [పై పై క్రొంగ్రొత్తవిషయములు స్ఫురింపజేసెడి త్రైకాలికవిషయప్రజ్ఞయే ప్రతిభ] అను విషయము గుర్తింపునకు తేబడినది. "అక్లిష్టాని" అనగా ప్రసన్నమనోహరము లని యర్థము.

వ్యుత్పత్తి -

"[33] ఛందోవ్యాకరణకలాలోకస్థితిపదపదార్థవిజ్ఞానమ్,
యుక్తాయుక్తవివేకో వ్యుత్పత్తిరియం సమాసేన".

ఛందశ్శాస్త్రము, వ్యాకరణము, చతుష్షష్టికళలు, లోకమర్యాద, పదముల పదార్థముల విజ్ఞానము, యుక్తాయుక్తపరిజ్ఞానము అను నివియే వ్యుత్పత్తియొక్క సంగ్రహస్వరూపము.

[34] "విస్తరతస్తు కిమన్యత్ తత ఇహ వాచ్యం న వాచకం లోకే,
న భవతి యత్కావ్యాంగం సర్వజ్ఞత్వం తతోఽన్యైషా".

[విస్తర మనగా వే రేమున్నది? దానిలో నంతయు ఇమిడి పోవును. కావ్యోపకరణము కానట్టి వాచకశబ్దము కాని వాచ్యార్థము కాని లేనే

---

[32] కావ్యాలంకార సూత్రవృత్తి - 1-3-17

[32] కావ్యాలంకారసూత్రము - 1-3-20

[33] రుద్రటకావ్యాలంకారము - 1-18

[34] రుద్రటకావ్యాలంకారము - 1-19

లేదు. మునుపటి సంగ్రహమునకంటె వేరైన విస్తీర్ణవ్యుత్పత్తి సర్వజ్ఞత్వమే కాని, వేరొండు కాదు.]

ఇట సమాసవిస్తరశబ్దములచేత వ్యుత్పత్తియొక్క దశావిశేషములు ప్రతిపాదింపబడినవి. వాచ్యవాచకములందు ఏ యొక్కదానికిని కావ్యాంగత్వ రాహిత్యము లేదని నిషేధించుటచేత (అన్నియు కావ్యాంగములే యనుట) "న తచ్ఛాస్త్రం న తచ్ఛిల్పం" అను మాట ప్రమాణీకరింపబడినది.

అభ్యాస మనగా -

"[35] అధిగతసకలజ్ఞేయః సుకవే స్సుజనస్య సన్నిధౌ నియతమ్,
నక్తందివ మభ్యస్యే దభియుక్త శ్శక్తిమాన్ కావ్యమ్".

అని నిరూపింపబడినది.

[తెలియవలసినదంతయు తెలిసినవాడై ప్రతిభావంతుడై కవి కాగోరు వాడు అభినివేశము కలవాడై సత్పురుషుడైన సుకవియొక్క సన్నిధిలో నియతితోడ రేయుంబవలు కావ్య మభ్యసింపవలెను.]

ఈ విషయమందలి విశేషములను క్షేమేంద్రుడు తన కవికంఠాభరణమునందు -

[36] "తత్రాఽకవేః కవిత్వాప్తిః శిక్షా ప్రాప్తగిరః కవేః,
చమత్కృతిశ్చ శిక్షాప్తౌ గుణదోషోద్గతి స్తతః,
పశ్చాత్పరిచయప్రాప్తి రిత్యేతే పంచ సంధయః".

[కవి కానివానికి కవిత్వశక్తి సమకూర్చుట, శబ్దములపై అధికారము గలవానికి శిక్షణ, శిక్ష ఏర్పడిన తరువాత చమత్కృతి, అటుపై గుణదోషవివేకము, తరువాత సకల శాస్త్రార్థగాఢపరిచయము - అనునివి పంచ సంధులు, అయిదు అధ్యాయము లనుట.]

ఇత్యాదిగా విపులగ్రంథమున వివరించినాడు.

ఈ విధముగా పైన నిర్వచింపబడిన శక్తివ్యుత్పత్త్యభ్యాసముల వైచిత్ర్య ప్రభావముచేత విలక్షణ యగు భారతి ఆ యా ప్రదేశములనుండి ప్రవహించుచు

[35] రుద్రట కావ్యాలంకారము - 1-20

[36] కవికంఠాభరణము.

భిన్నవిభిన్నరూపమగు తన వైఖరిని ప్రవర్తిల్లజేయును. వర్షధార ఒక్కటే యయినను ఆ యా ప్రదేశముల సాంగత్యమహిమతో నానాప్రకారముగా పరిణమించుచున్నది. విధాతయొక్క సృష్టినైపుణ్యము ఒకే తీరు గలదైనను ఆ యా జీవాత్మల కర్మవిశేషగతులను బట్టి ఒక్కొక్క వ్యక్తియందును వేర్వేరురూపమున గోచరమగుచున్నది. పై జెప్పిన సామగ్రిని సమగ్రముగ సంపాదించి విదగ్ధజనుల హృదయముల నాకట్టుకొను వాఙ్మయముల రచించుచున్నవారై కాళిదాస భవభూతి ప్రభృతులైన కవులు నూర్లకొలదిగ నుండిరి. వారియొక్క ప్రబంధములు ఈ జగత్తునకు రసనాడింధమములై (రసవాహినులై) యున్నవి. అట్టి మహాప్రబంధముల యునికిచేతనే పాపిష్ఠ కలికాలరూప కీటములచే పీల్చివేయబడి వీతసారయయియు ఈ జగతి సరససారసాహిత్యమును ఆవిష్కరించుచున్నది. వీని యునికిచేత మూగయైన ఈ జగత్తునందు ఇప్పటికిని కొందరు సుభాషితములను ఆవిర్భవింపజేయుచు మన చెవులకు అమృతంపుపారణ పెట్టుచున్నారు. ఆ ప్రబంధములే జగమునకు జీవితము; ప్రతిభకు తొడవులు; కావ్య శిల్పమునకు కార్మణమను మూలికామాహాత్మ్యకల్పితవశీకరణవిద్య. వ్యుత్పత్తికి ప్రతిష్ఠ. గోష్ఠీసమావేశములకు పరిష్కరణ. కౌశలకనకమునకు గీటురాయి. వైదగ్ధ్యమునకు పరాకాష్ఠ. గుణరత్నములకు రోహణాద్రి. ప్రజ్ఞానేత్రమునకు అమలినమగు అంజనాలంకరణము. విలాసవృక్షములకు వసంతమాసము. నీతివల్లికకు మూలకందము. సౌభాగ్యలతకు కుసుమస్తబకము. విద్యలకు ఆపణము(అంగడి). సరస్వతికి సంవనన మను మంత్రమహిమతో సాధించిన వశీకరణవిద్య. లోకవ్యవహార మనెడు మహాహర్మ్యమునకు పునాది. చెడు నడతపైరుకు కత్తెర. దౌర్భాగ్యవృక్షమునకు గండ్రగొడ్డలి. ఇంతియ కాక, అట్టి సుభాషితానుభవముచేత పరవశాంతరంగులైన కొందరు రసికసార్వభౌములు అమృతమును గూడ అవధీరణ చేయువారై, ఎలనాగకెమ్మోవినైనను ఎకసక్కెము చేయువార్రై, ఖాదిరసారఖండమును గూడ (కాచుకణికను) ఖండించువారై విహరించుచున్నారు. సుభాషితసారసంశీలనరసజ్ఞని పలుకులివి -



"సుభాషితరసాస్వాదలహరీ యది లభ్యతే,
అలం హారైః కిమాహారైః, విహారైరపి సుభ్రువామ్."



[సుభాషితరసాస్వాదలహరి లభ్యమగువో హారములు వలదు. ఆహారము లేల? సుందరాంగులతోడి విహారము లవి యేల ?]

అట్టి సుభాషితముల పరిశీలనయే లేనియెడ మానవుడు విద్వాంసు డయియు జడునివలెను, కండ్లు కలిగియు గ్రుడ్డివానివలెను, చైతన్యము కలవాడయియు చైతన్యహీనునివలెను, చేష్టలుండియు అంగవికలునివలెను, బ్రదికియుండియు మృతుని వలెను, వినుచుండియు సదుపదేశము వినలేని చెవిటివానివలెను, నాగరికుడయియు గ్రామీణజంతువువలెను అగుచున్నాడు. సుభాషితవిలాసములచేత ఆకర్షింపబడని మనసుకలవాడు కొమ్ములు లేకున్నను పశువ్యవహారము పొందును. విషపుకోరలు లేకున్నను నాగుబామువలె సహృదయులను ఉద్వేగపరచును. దండము పాశము లేకయే యమునివలె రసికులను భయపెట్టును. ఇట్టి నీరసహృదయుడు జాడ్యము (జడత్వము) నకును జాడ్యోపదేశకు డగును. కాఠిన్యమునకు కాఠిన్యము నేర్పును. అలసత్వమునకు అలసతను ఉపదేశించును. కుటిలత్వమునకే కౌటిల్యము కఱపును. నిస్త్రింశమునకు గూడ నిస్త్రింశత్వమును (ఖడ్గమునకు గూడ క్రూరత్వము) నేర్పును. అతడు మందరాద్రిశిఖరమునుండి కార్కశ్యమును, నిశావసానమందలి దీపమునుండి నిస్స్నేహత్వమును (తైలము లేకుండుటను, మైత్రి లేకుండుటను) నాగుబాముల నుండి ద్విజిహ్వత్వము (రెండుగా చీలిన నాల్కలు కలిగియుండుట, రెండు నాల్కలు కలిగియుండుట) పీతలనుండి అడ్డముగా నడచెడు స్వభావమును, బడబాగ్నినుండి అఖిలజీవనగ్రసనలోభమును (నీటి నంతయు మింగివేయవలె నను పేరాస, అందరిప్రాణముల యపహరణముపైని దురాశ) తాబేటివీపునుండి కాఠిన్యమును, పెనుబామునుండి (కొండచిలువనుండి) సోమరితనమును, గార్దభమునుండి శ్రవణోద్వేజకవిరావమును, కపికులమునుండి చపలత్వమును గ్రహించినవానివలెనై తనను సర్వాశుభములకు విలాససౌధముగా నిర్వహించుచున్నాడు.

ఇదియునుగాక, అతడు తీక్ష్ణదృష్టియయియు తనలోని పెద్దలోపమును (దోషమును) సైతము చూడడు. ధృష్టుడయియు పరలోకాక్రమణనైపుణి సాధించుటలేదు. [తప్పు చేసియు నిర్భయుడై యుండువాడు ధృష్టుడు. అతడు పర (స్త్రీ) జనవశీకరణలో నైపుణ్యము చూపును. కాని ఇత డట్లు కాదు. స్వర్గాది లోకముల నాక్రమించుటలో శ్రద్ధ చూపుటలేదని భావము]. సాహసికుడయియు సభలో వ్యవహారములవలన భయపడుచున్నాడు. పుట్టుగ్రుడ్డియయియు పరులయందు దోషముల నెన్నుటలో దివ్యదృష్టిగలవాడు. మరియు అతనికి తెలివిలేమిచే మౌనము, సత్పురుషుల నిందించుటయందలి కుతూహలముచేత వాచాలత్వము, దంభముచేత సత్క్రియారంభము, గత్యంతరములేక ఇతరుల ననుసరించుట,

తన పరాక్రమము విఫలమగుటచేత ఉపశాంతియు కలుగుచున్నది. ఇంతయే కాక సదుచ్ఛేదకరుడై తపనుడైయుండి సత్పథమునుండి భ్రష్టుడై మరల నభ్యుదయము పొందడు. సూర్యపక్షమున - నక్షత్రముల నదృశ్యములగునట్లు చేయువాడు, (తపనుడు సూర్యుడు) నక్షత్రమార్గము (ఆకాశము) నుండి భ్రష్టుడై (అస్తమించి) యని యర్థము. అరసికుడైన యల్పుడు సాధువుల నాశమునకు కారకుడై, తాపము కలిగించువాడై సన్మార్గమునుండి భ్రష్టుడై యని యర్థము. (ఇట్లితడు సూర్యసముడు) సూర్యుడు భ్రష్టుడై మరల నుదయించును. ఇతడు అభ్యుదయగామి కాలేదు. చంద్రుడు కుటిలుడు, కలంకి, జడుడు, అనగ వక్రాకృతి గలవాడు, మచ్చగలవాడు, చల్లనివాడు. అల్పుడు కుటిలవర్తనుడు, కళంకము గలవాడు, మందబుద్ధి. కావున నితడు చంద్రుని వంటివాడు. కాని చంద్రుడు కువలయామోద సంధాన రసికుడు అనగా కలువలకు వికాసముద్వారా పరిమళ మొదగూర్చుటయందు/ రాసిక్యము గలవాడు. ఇత డట్లు కాడు. భూమండలమునకు సంతోషము కలిగించుటయందు రాసిక్యము వహింపడు. ఘూకము(గూబ) వలె నీతడు సూర్యాలోకవిముఖుడే కాని ఎచ్చటను పక్షపాతము కలవాడు కాడు. గూబ (దివాంధము) సూర్యాలోకవిముఖము, సూర్యుని వెలుగు చూడలేదు. కాని దానికి పక్షపాతము, ఇష్టమైనచోట రెక్కలతో ఎగిరెడు శక్తి ఉన్నది. అరసికుడు సూరిఆలోకవిముఖుడు. పండితుల ముఖదర్శన మోర్వలేడు. అట్లయి ఎచ్చోటను పక్షపాతము లేనివాడు, ఏ విషయమునను అభిమానము లేనివాడు. ఇతడు కాకివంటివాడు. కాకి కరటము, విషమదృష్టి, ఆత్మ ఘోషము - ఈ మూడును కాకిపేళ్ళు. ఈత డట్టివాడే. కటువుగ అరచెడి స్వభావము గలవాడు. వక్రదృష్టి, ఆత్మశ్లాఘాపరాయణుడు. కాని బంధుమైత్రి ప్రదర్శింపడు. కాకి బంధుమిత్రము; ఆహారపదార్థము కంటపడినప్పుడు తన బంధువర్గమును పిలుచును. ఈత డట్లు చేయడు. పద్మము కర్కశదండము, భంగురగుణము పంకాశ్రయము; సరసాళిశ్రీని పోషించును. (పద్మపుకాడ ముళ్లు గలిగి కర్కశమైనది. తామరతూడులోని సన్నని దారము తెగిపోవు స్వభావము గలది; పంకమునుండి పుట్టినది. అరసుడును కర్కశముగ దండించువాడు, దుర్బలగుణుడు, కలుషాశ్రయుడు. పద్మము- రసికభ్రమరముల శోభను పోషించును. ఇత డట్లు కాడు. రసికశ్రేణిశ్రీని పోషింపడు. ధూళివలె పాదాహతుడై గొప్పవారి శిరములనైనను తటుకున నధిష్ఠించును. అకాలపుష్పావిర్భావము వలె మనోహరు డయియు భీతిగొల్పును. ఇంతయే కాక, అతనిని వివాహప్రక్రియలో దుర్నిమిత్తమును వలెను, యాత్రాసమ

యమున పురశ్చ్సుని వలెను, యాగారంభమున చండాలదర్శనమును వలెను, శాంతికర్మలో (ఆడు) నక్కఊళ వలెను సజ్జనులు భావింతురు. అతనిని ఒక్కసారి స్మరించుటను కూడ మహాపాతకాధ్యవసాయమువలె పరిహరింపవలసినవానిలో ధీమంతులు చేర్చెదరు.

ఇట్లు సమస్తభువనమును ఉనికిలేములచే నిమ్నోన్నతముగ జేయగలట్టి సుదృక్కుల (తత్త్వజ్ఞులు, మదిరాక్షులు) హృదయమున వెలుగొందునట్టిదై సువృత్తములై (మిగుల గుండ్రనివై, మంచి ఛందోవృత్తములు గలవై) ఉజ్జ్వలములై, చల్లనివై, సుకుమారములైన సూక్తు లనెడి ముక్తాహారమును నిర్మింపగలవారును, భువనమునకే భూషణమైనవారును, గౌరవార్హపావనజన్మలును అగు అట్టి మహనీయులు ప్రకృతమున విరళప్రచారము గలవారే యని కలికాలమహిమను అనుసంధించుచున్నవారమై సుభాషితావిర్భావము స్మరింపవలసిన వైభవము గలదే యైనదని పలుమారులు వగచుచున్నవారమై కర్తవ్యాంతరవ్యగ్రతను త్రోసిపుచ్చుచున్నట్టి, (ఏ పనిని చేయనీయనట్టి) నేటి గీర్వాణభారతీవిధ్వంసనస్మృతి యనెడి దావానలకీలలచే పవలనక రాత్రియనక దందహ్యమానులమైనను అట్టివారలు (మహాకవులు) కొందరైనను లేరు గదా యని అత్యంతాభావమును ధైర్యముగా ప్రతిజ్ఞ చేయలేకున్నాము; ఏలన, ఎక్కడో ఒక్కెడ కొందరు మా ప్రియమిత్రులగు శ్రీ మహామహిమ శ్రీమద్వంచిమహారాజ్ఞీప్రియతమ శ్రీకేరళవర్మ పర్వరాజ ప్రముఖులగు విద్యాధికు లావిర్భవించియున్నారు కదా! వారిప్పుడు కూడ తమ వాగ్విలాసపీయూషవర్షధారలచే పాషాణాదులను గూడ కరగించుచున్నారు.

అట్లైనను ఇప్పటివారికంటె ప్రాచీనులు శ్రేష్ఠులగుటకు మూల కారణము వారిని ప్రోత్సహించిన యప్పటిరాజులే. ఆ ప్రభువులు ఈ యశేషభువనమునకును, సరస్వతీదేవికిని మూర్తీభవించిన భాగ్యస్వరూపులు. వారు అస్తంభులైనను, (స్తబ్ధతలేని, స్తంభముకానివారలు) సుచరిత్రకు ఆధారస్తంభములైనారు; ఏలన, కుముదినులవలె (కలువతీగలవలె) విద్యలుగూడ రాజపరిగ్రహము లేక (ప్రభువుల ఆదరణ, చంద్రుని స్వీకరణ లేక) విలసిల్లనేరవు.

అట్టి మహిమోదారులగు కవులు ధారానగరాధివాసియై విదర్భనాథుడగు శ్రీభోజభూపాలుని సభలో సమకాలికులై యుండిరని భోజప్రబంధాదులు ప్రతిపాదించుచున్నవి. అధునాతనవిమర్శకుల నిర్ణయమున కది విరుద్ధము. అది యెట్లనగా- వామనాచార్య ఝలకీకర్ కావ్యప్రకాశికాప్రస్తావనయందు

భోజరాజును క్రీ.శ. 996 వ సంవత్సరము మొదలు 1051 వ సంవత్సరము వరకు ఉన్నవానినిగా పేర్కొనెను. ఆ రెండిటి మధ్యకాలము 55 ఏండ్లగును. కనుక, "పంచాశత్పంచవర్షాణి సప్తమాసా దినత్రయమ్, భోజరాజేన భోక్తవ్య స్సగౌడో దక్షిణాపథః", (55 సంవత్సరముల ఏడు నెలల మూడు దినములు గౌడదేశముతో గూడిన దక్షిణాపథము భోజరాజుచే పాలింపబడవలసియున్నది.) అను శ్లోకము నాధారముగా గొనియే ఇట్లు ప్రతిపాదించినాడని యూహింతుము. దాని ననుసరించినను పుట్టినది మొదలు రాజ్యప్రాప్తివరకు (వత్సరాది) కాలసంఖ్య తెలియరాదు. పైజెప్పిన కాలమునకంటె ఏడునెలల మూడు దినముల కాలము అధికముగ కలుపవలసియున్నది. మహోపాధ్యాయ దుర్గాప్రసాద - కాశీనాథశర్మలు రాజశేఖరకవిజీవనకాలము క్రీ.శ. 884 వ సంవత్సరమునకు తరువాతిదనియు క్రీ.శ.959 వ సంవత్సరమునకంటె ప్రాచీనమనియు వివరించినారు. ఆ రాజశేఖరకవి -

"సరస్వతీవ కర్ణాటీ విజయాంకా జయత్యసౌ
యా వైదర్భగిరాం వాసః కాలిదాసా దనంతరమ్,
త్రయో దండిప్రబంధాశ్చ త్రిషు లోకేషు విశ్రుతాః
మాఘేనేవ చ మాఘేన కంపః కస్య న జాయతే"

"సమో బాణ మయూరయోః - - -"

"బభూవ వల్మీకభవః కవిః పురా తతః ప్రపేదే భువి భర్తృమేంఠతామ్,
స్థితః పునర్యో భవభూతిరేఖయా స వర్తతే సంప్రతి రాజశేఖరః."

["కర్ణాటదేశీయ యగు విజయాంక యను కవయిత్రి సరస్వతీదేవివలె ఉత్కృష్టురాలై యున్నది. కాళిదాసుని తర్వాత ఆమెయే వైదర్భీరీతి వచనములకు ఉనికిపట్టు. దండిమహాకవి రచిత ప్రబంధములు మూడును ముల్లోకములందును ప్రఖ్యాతములు. మాఘకవివలన మాఘమాసమువలనవలె ఎవ్వనికి వణకు పెట్టదు. (శిశిరఋతుసంబంధియగు మాఘమాసము వణకు పుట్టించును. అట్లే మాఘమహాకవిపేరు విన్నంతనే క్షుద్రజీవులకు వణకు పుట్టునని భావము.)- - - బాణకవికిని మయూరకవికిని సమానుడు. - - - - ముందుగా పుట్టనుండి పుట్టిన కవిగా (వాల్మీకిగా) జన్మించినాడు. తరువాత భర్తృమేంఠుడైనాడు (హయగ్రీవవధాఖ్యనాటకకర్త). మరల నెవ్వడు భవభూతిరూపమున నుండెనో ఆతడే యిప్పుడు రాజశేఖరుడై

యున్నాడు"]

అని చెప్పినాడు. వీనిలో కడపటి శ్లోకము బాలరామాయణమునందును ఇతరశ్లోకములు శార్ఙ్గధరపద్ధతి - సూక్తిముక్తావళి - సుభాషితహారావళు లందు (వరుసగా) కూర్పబడినవి. ఇతనికే బాలరామాయణకర్తృత్వము మహేంద్రపాల గురుత్వము ప్రతిపాదించుటవలన ఇతడు వేరొకడు కాడు. అందుచేత రాజశేఖరునకు భవభూత్యాదులకంటె పశ్చాత్కాలికత్వము చెప్పవలెను. అట్లు అంగీకరించినచో క్రీ.శ. 884 వ సంవత్సరమున ఉన్నవాని (రాజశేఖరుని) కంటె ప్రాచీనులగు వీరు క్రీ.శ. 996 వ సంవత్సరమునకు తరువాత నుండిన భోజుని యాస్థానమునకు ఎట్లు కొంపోబడిరి. ఇది విమర్శనీయము. ఆ భోజుడు సరస్వతీకంఠాభరణమునందు రాజశేఖరుని శ్లోకముల నుదాహరించుచున్నాడు. కావున రాజశేఖరునికంటె భోజున కర్వాచీనత్వ మంగీకరింపవలసినదే.

ఇప్పట్టున నిర్ణయ మెట్లు చేయుట? ఆ కవు లెచ్చటగాని తమ ప్రబంధములందు తమ కాలాదులను బయల్పరుపరు. అట్లు బయల్పరచుట యచ్చట నిరుపయోగమని తలచుటే బయలుపరుపకుండుటకు కారణము. అట్లు కాగా ప్రత్యక్షానుమానములకు విషయములు కానట్టి వికల్పకల్పనలచేత ప్రామాణ్యము కోల్పోయిన చిరకాలాతీతమైన ఈ విషయమున నిర్ణయించుట యెట్లు? సహృదయులే విమర్శింతురు గాక! యుగాంతరములందును విదర్భ రాజులందు భోజపద ముపయోగింపబడుట కన్పించుచున్నది. విదర్భలో పుట్టిన రాజులందరు భోజులు అని, ఆ పేరు గల వ్యక్తులు భిన్న భిన్న వ్యక్తులని భేద మంగీకరించినను కాళిదాసభవభూత్యాదులు (భోజుని వలె కాళిదాసులు, భవభూతులు పలువురు కాక) ఒక్కొక్కరే యగుటచేత (దీర్ఘకాలభేదమున్న) వారికి ఏకకాలికత్వ మెట్లని సంశయము కలుగుచో దానికి సమాధానము లేదు. భోజప్రబంధాదులు కొన్నిటికి అప్రామాణ్యమును, వేరైన కొన్నిటికి ప్రామాణ్యమును అంగీకరించి సమాధానము చెప్పకొనవచ్చు నన్నచో అనుకూలతర్కము లేకపోవుటచేత దేనికి అప్రామాణ్యము దేనికి ప్రామాణ్యము స్వేచ్ఛగా (నిర్హేతుకముగా) అంగీకరింపగలము?

అందు, కాళిదాసుని గ్రామాదివృత్తాంతము విశేషించి తెలియదు. తానుగా తన యే గ్రంథమందుగాని దానిని ప్రకటించుకొనలేదు. కొందరతనికి మేధావిరుద్రుడను నామాంతరమున్న దందురు. క్షీరనదీ (పాలాఱు) తీర మున నున్న లాడపురాగ్రహారము దండికవి వాసస్థానమని ప్రతిపాదించుచున్నారు.

మల్లికామారుత ప్రకరణము (దశవిధదృశ్యప్రబంధములలో ప్రకరణ మొక్కటి) చూచిన యితరులు ఉద్దండుడను నిత డధునాతనుడై ప్రాచీనదండికంటె భిన్నుడని నిరూపించుచున్నారు.

రచనాశైల్యాదులను బట్టి ఎట్లో నిర్ణయింపవచ్చు ననెడి భావము నిరూపణకు నిలువలేదు. సాహసికులకు మాత్రమే అది సులభము. ఏలనన, ఒకే కవికి కాలభేదమును బట్టి, విషయభేదమును బట్టి, అభ్యాసభేదమును బట్టి అకుశలుడైన కవియొక్క వాణికూడ భిన్నరూపగా నుండును. ఇట్లుండ వశ్యవాక్కులగువారికి రచనారీతిని మార్చుట యేపాటి? మేము (మనము) కూడ ఆ యా విషయభేదమునుబట్టి భిన్నభిన్నప్రకార యగు వచనధారను వెలయించువారమై కన్పట్టుచున్నాము. కవికథకకంఠీరవులగు శ్రీమద్వేదాంతదేశికాచార్యులట్లే ప్రతిపాదించిరి-

"గౌడవైదర్భపాంచాలమాలాకారాం సరస్వతీమ్,
యస్య నిత్యం ప్రశంసంతి సంత స్సారభవేదినః."

[కవితాపరిమళాలను చక్కగా అనుభవింప తెలిసిన సజ్జనులు గౌడ-వైదర్భ-పాంచాలరీతుల మాలారూపిణి యగు నెవ్వని సరస్వతిని ఎల్లప్పుడు ప్రశంసించుచున్నారో-అని].

కావున అక్షరసంఘటనాత్మకములగు వాక్యములందు మృదు-కఠిన-ఈషన్మృదు-ఈషత్కఠినములగు వర్ణసంయోగవశమున శాబ్దరీతిలో వ్యత్యాసము సులభము కాగా ఏకకవినిబద్ధమగు శబ్దరీతి ఏకరూపమే యని ప్రతిజ్ఞ చేయనలవి కాదు. అర్థశైలియు, అర్థబోధనవిధానభేదములగు ద్రాక్షానాలికేరాదిపాకములలో భేదముండగ ఇది యితని దని యెట్లు స్పష్టమగును? అదియును గాక, పలువురిలో వర్ణనప్రకారము ఏకరూపముగ నున్నది. ఇంతయుగాక,అన్యచ్ఛాయాయోనికములగు రచనలందు అన్యచ్ఛాయలు కన్పించును కావున నిది నిర్ణయదూరమైన దని చెప్పవలసిన పని లేదు. మరియు, దండ్యాచార్యాదులగు ఆలంకారికులు ఆ యా జాతికి ఉదాహరణములు చూపవలసిన ప్రకరణములందు ఆ యా ప్రకారములతో కూడిన తమ శ్లోకములనే యుదాహరించుచున్నారు. అక్కడ (భిన్నభిన్నశైలులందు) ఏకకవికర్తృకత్వస్ఫూర్తి నంగీకరించినపుడు శైలీభేదము కర్తృభేదము నెట్లాపాదించును; అన్యనిర్మితత్వస్ఫూర్తి విరుద్ధము. పరీక్షకత్వమునకు అనర్హులైన కొందరు చూపెడి శైలీభేదముతో కర్తృభేదపరికల్పనాడంబరము కేవలము తమయందు వ్యర్థపరీక్షకత్వాభినయము మాత్రమే యని తలంతుము. ఇట్లనుటచేత కాళిదాసభేదమును (పలువురు కాళిదాసులని)

వాదించెడువారు విచారింపబడినట్లే (నిరసింపబడినట్లే). శైలులలో భేదమే యున్నది. దానిని ఆధారముగా గొనిననే నీకైనను (సిద్ధాంతికి, గ్రంథకర్తకు) ప్రతిభాదిత్రితయగత తారతమ్యమును బట్టి కవుల ప్రస్థానభేదము సిద్ధించును. ఆప్రస్థానభేదవాదము సిద్ధించును. ఆ ప్రస్థానభేదమే "[37] అస్త్యనేకో గిరాం మార్గః సూక్ష్మభేదః పరస్పరమ్" (పరస్పరము సూక్ష్మభేదముగల వాక్ప్రస్థానము నానాప్రకారముగా నున్నది.) మున్నగు వాక్యములచే కావ్యాదర్శమున ప్రకటీకరింపబడినది" అని (పూర్వపక్షి) యన్నచో, అట్టి యెడ అట్టి భావకులను కొందరిని సంభావింతుము; ఎవ్వారికి-

> "[38] తద్భేదాస్తు న శక్యంతే వక్తుం ప్రతికవి స్థితాః,
> ఇక్షుక్షీరగుడాదీనాం మాధుర్యస్యాంతరం మహత్,
> అథాపి న తదాఖ్యాతుం సరస్వత్యాపి శక్యతే."

[ఒక్కొక్క కవియందును నున్నట్టి ఆ భేదములను వర్ణింప నలవి గాదు. చెరకు పాలు బెల్లములం దున్నట్టి మాధుర్యములకు అంతరము పెద్దదే. అయినను దానిని నిరూపించి చెప్పుట సరస్వతికిని అసాధ్యమే.]

అని విమర్శకులచేత గూడ కేవలాత్మసాక్షికముగమాత్రమే తెలియదగినదని చెప్పిన మిగుల సూక్ష్మతమాంశమును గూడ ప్రకటింప గల ధీరత గలదో." గ్రంథకర్తమాట ఇది. "అట్లైనచో మీరు (గ్రంథకర్త) సూచించినట్లు ఆత్మసాక్షికముగానే (స్పష్టముగా చెప్పలేకపోయినను భేదమును నిర్ణయింతుము. అందుచేత శైలీభేదమును బట్టి వారిని భిన్ను లనియే పల్కెదము" అని మరల వారు పల్కెదరేమో యని పూర్వపక్ష మూహించి గ్రంథకర్త కడపట్ల నిట్లనుచున్నారు. "మేము కూడ (గ్రంథకర్త) అట్టిదే యగు (ఆత్మసాక్షికమైన) అనుభవముచేత అభిన్నులనియే మేము పల్కెదము." ఇక, "మావలె అట్టి భేదనిరూపణసామర్థ్యము లేకుండుటచేతనే మిము బోంట్లకు ఐక్యానుభవము" అని (మొండి) వాదము చేయుచో, ఇకపై సరసవాదగోష్ఠీబహిర్భూతములైన వాగ్వ్యాపారములు మీతో వలదనుకొనుచు నిసర్గదాక్షిణ్యవంతులమగు మేము విరమించుచున్నాము.

ఐతిహ్యమునకు కొన్నియెడల అసత్యత్వము, కొన్నియెడల సత్యత్వము

---

[37] కావ్యాదర్శము - 1-40.

[38] అందే. 1-101, 102.

శాస్త్రవశ్యులచే అంగీకరింపబడుచున్నది. మరియు, బాధకప్రమాణములు లేనప్పుడు జ్ఞానసామాన్యమునకు (అన్ని జ్ఞానములకు) సత్యత్వమును విద్వాంసులు సమ్మతించుచున్నారు. కావున ఎట్టి విషయములకు అన్యులచే ప్రామాణ్యము స్థాపింపబడిన వచనములతో విరోధ మేర్పడదో అట్టివానికే సత్యత్వము తద్భిన్నములకు మిథ్యాత్వము చెప్పవలెను.

ప్రస్తావనలో నున్న భవభూతిమహాకవి తన యాత్మకథ యేదో కొంచెము తన ప్రబంధములందు ప్రకటించుచున్నాడు- "[39] దక్షిణాపథమున పద్మపుర మను నగర మున్నది. అందు తైత్తిరీయవేదశాఖకు చెందినవారును, పంక్తిపావనులును కాశ్యపగోత్రులును, పంచాగ్నుల వ్రేల్చువారును, సోమపానము చేసినవారును, వ్రతముల నిర్వహించినవారును ఉదుంబరు అను ఇంటిపేరు గలవారును అగు బ్రాహ్మణులు కొందరు నివసించుచున్నారు. అట్టి వారి కులమునందు పుట్టిన పూజ్యుడగు భట్టగోపాలునకు పౌత్రుడును, పవిత్రకీర్తియగు నీలకంఠునకు పుత్రుడును శ్రీకంఠ అను పదము తనకు పేరుగా గలవాడును, వ్యాకరణ మీమాంసా న్యాయశాస్త్రములు తెలిసినవాడును, 'భవభూతి' అను పేర ప్రసిద్ధుడును అగు 'జాతుకర్ణి' యను నామె పుత్రుడు" - అని.

ఇచట దక్షిణాపథ మనగ వైదర్భదేశము మొదలుకొని నందిదుర్గము వరకు నున్న భూభాగము. ఈ సంబంధముననే వైదర్భి దాక్షిణాత్యరీతి యనబడుచున్నది.కావ్యాదర్శమునం దీ విషయమే "[40] అతో నైన మనుప్రాసం దాక్షిణాత్యాః ప్రయుంజతే" అని తెల్పబడినది. పద్మపురమునకు ఈ దినములలో ఏమని వ్యవహారనామమో తెలియదు. బ్రాహ్మణులు అనగ "బ్రాహ్మణోఽపత్యాని పుమాంసః" అనగ బ్రాహ్మణజాతిలో పుట్టినవారని యర్థము. అంతేకాని బ్రహ్మజ్ఞత్వము ఆ పదప్రయోగమునకు నిమిత్త మనరాదు. బ్రాహ్మణశబ్దమునకు బ్రాహ్మణజాతియందు పుట్టినవాడని యర్థమే కాని బ్రహ్మజ్ఞానసంపన్ను

---

[39] "అస్తి దక్షిణాపథే పద్మపురం నామ నగరమ్. తత్ర బ్రాహ్మణాః కేచిత్ తైత్తిరీయాః పంక్తిపావనాః కాశ్యపాః పంచాగ్నయ స్సోమపీథినో ధృతవ్రతాః ఉదుంబరనామానః ప్రతివసంతి. తదాముష్యాయణస్య తత్రభవతో భట్టగోపాలస్య పౌత్రః పవిత్రకీర్తే ర్నీలకంఠస్య పుత్త్రః శ్రీకంఠపదలాంఛనః పదవాక్యప్రమాణజ్ఞో భవభూతి ర్నామ జాతూకర్ణీపుత్త్రః" ఇతి. ప్రస్తావన-మాలతీమాధవము, మహావీరచరితము.

[40] కావ్యాదర్శము 1-60.

డని నుడువరాదు. "[41] బ్రాహ్మో జాతౌ" అను పాణినిసూత్రముచేత బ్రహ్మశబ్దము జాతివాచకము కానప్పుడు, అనగ బ్రహ్మజ్ఞానసంపన్నుడని అర్థము వివక్షింపగ 'టి'లోపము సంభవించును. అప్పుడు 'బ్రాహ్మ' అను రూపమే సిద్ధించును. తిత్తిరిచే ప్రోక్తమగు (వేదభాగమును) అధ్యయనము చేయు యజుశ్శాఖవారు తైత్తిరీయులు. "[42] తిత్తిరి వరతంతు ఖండికోఖాచ్ఛణ్" అను శైషికప్రకరణమందలి పాణినిసూత్రముచే తైత్తిరీయశబ్దము నిష్పన్నము. అముష్య అపత్యం ఇతని సంతానము, పుత్రుడు అను నర్థమున "[43] నడాదిభ్యః ఫక్" అను సూత్రముచేత ఫక్ ప్రత్యయము సంభవింప, దానికి 'ఆయన్' ఆదేశము రాగ, "[44] ఆముష్యాయణాముష్యపుత్త్రికాముష్యకులికేతి చ" అను వార్తికముచేత 'అముష్య' అనునెడ షష్ఠీవిభక్తికి లోపము రానంతట 'ఆముష్యాయణ' శబ్దము సిద్ధించును. (ప్రసిద్ధాత్పితు రుత్పన్నః - ప్రసిద్ధుడగు తండ్రికి పుట్టినవాడు ఆముష్యాయణుడు అని సాహిత్యసమయసిద్ధార్థము) భవభూతి ర్నామ భవభూతి యను పేర ప్రసిద్ధుడు. "[45] సాంబా పునాతు భవభూతిపవిత్రమూర్తిః" (పరమశివుని విబూదిచేత పవిత్రమూర్తిగలట్టి ఆ జగదంబ పవిత్రీకరించుగాక!) అనెడి భవభూతిశబ్దఘటిత పద్యరచననిమిత్తముగ కవి కేర్పడిన బిరుదనామ మిది. పదునొకండవదినమున తండ్రి పెట్టిన పేరు శ్రీకంఠ అనుపదము. 'శ్రీకంఠపదలాంఛనః' అనెడి పదమున కిట్లు వ్యాఖ్యానము కొందరు చెప్పుచున్నారు - "శ్రీకంఠ అనెడి పదము ఇతరులనుండి వేరుపరచు లాంఛనము గురుతు ఎవ్వని కున్నదో అతడు శ్రీకంఠపదలాంఛనుడు"- అని.

ఇతడు బాల్యమునుండియు జ్ఞాననిధి యను యోగినుండి వేదవేదాంగములు నేర్చెనని ఈ క్రింది శ్లోకమువలన తెలియుచున్నది-

---

[41] అష్టాధ్యాయి 6-4-171.

[42] అష్టాధ్యాయి 4-3-102.

[43] అష్టాధ్యాయి 4-2-99.

[44] వార్తికము 3878, 3879,

[45] చాటువు.

"46 యద్వేదాధ్యయనం తథోపనిషదాం సాంఖ్యస్య యోగస్య చ
జ్ఞానం తత్కథనేన కిం నహి తతః కశ్చిద్గుణో నాటకే,----"
"47 శ్రేష్ఠః పరమహంసానాం మహర్షీణామివాంగిరాః,
యథార్థనామా భగవా న్యస్య జ్ఞాననిధి ర్గురుః".

["వేదాధ్యయనము, ఉపనిషదధ్యయనము, సాంఖ్యయోగశాస్త్రముల జ్ఞానము - వీనిని చెప్పుటచేత నగున దేమున్నది. అందువలన నాటకమునకు గుణమేదియు కలుగబోదు." (ఇట్లనుటచేత ఇతడు పై శాస్త్రములన్నియు చదివినట్లు తెల్లము)]

["మహర్షులలో అంగిరసునివలె పరమహంసులలో (సన్న్యాసులలో) శ్రేష్ఠుడును, షడ్విధజ్ఞానసంపన్నుడును, అన్వర్థనామధేయుడును అగు జ్ఞాననిధి ఎవ్వనికి గురుడో - - - - " అని.]

ఇచట ప్రతిపాదింపబడిన జ్ఞాననిధియొక్క గురుత్వము ఏ ఒక్క శాస్త్రమునో చదివించుటచే చరితార్థమైన దనరాదు. వేరొక గురువే యుండినచో ఈతనిని వలె ఆ గురువును గూడ ప్రకటించియుండును. అట్లు చెప్పకపోవుట గుర్వంతరాభావమును సాధించుచున్నది. అట్లే ఇతరులు ప్రతిపాదించుచున్నారు. రసగంగాధరము చూడుడు - -

"శ్రీమజ్జ్ఞానేంద్రభిక్షో రధిగతసకలాద్వైతవిద్యాప్రపంచః
కాణాదీ రాక్షపాదీరపి గహనగిరో యో మహేంద్రా దవేదీత్,
దేవాదేవాఽధ్యగీష్ట స్మరహరనగరే శాసనం జైమినీయం
శేషాంకప్రాప్త శేషామలఫణితి రభూత్సర్వవిద్యాధరో యః".

["ఎవ్వాడు శ్రీమంతుడగు జ్ఞానేంద్రభిక్షువు (సన్న్యాసి)నుండి నేర్చిన సకలాద్వైతవిద్యావిస్తారము గలవాడో, ఎవ్వడు మహేంద్రు డను పండితునుండి దుర్గ్రాహములైన గౌతమ కణాద నిర్మితములైన న్యాయవైశేషిక దర్శనములను తెలిసెనో, ఎవ్వడు కాశికాపట్టణములో జైమినీయశాస్త్రమును (మీమాంసను) ఖండదేవునుండియే కఱచెనో, ఎవ్వడు శేషోపనామక వీరేశ్వరపండితునుండి పాతంజలభాష్యమును పొందెనో, (ఈ రీతిగ ఎవ్వడు) సర్వవిద్యాధరు డాయెనో

46 మాలతీ మాధవమ్. 1-10.

47 మహావీరచరితము - 1-6.

- - - - 48 ".]

ఈ కవి నిర్మించిన ప్రబంధములు మహావీరచరితము, ఉత్తర రామచరితము మాలతీమాధవప్రకరణము - అనునివి లభించుచున్నవి. ఇంతకంటె వేరగునవి రచింపబడినవో లేదో అని నిశ్చయింపలేకున్నాము. ఈ మూడింట మాలతీమాధవము శృంగారరసప్రధాన మనునది నిర్వివాదాంశము. వీరచరితము వీరరసప్రధానమని "[49] అప్రాకృతేషు పాత్రేషు యత్ర వీరః స్థితో రసః" అని కవియే విశదీకరించినాడు.

కొందరు సహృదయులు ఉత్తరరామచరితమును కరుణరసప్రధానముగా నుండవలె నని యభిలషించుచున్నారు. ఆ విషయమున కొన్ని యుపపత్తులు (అనుకూలహేతువులు) వర్ణించుచున్నారు--.

ప్రతీయమానమగు రతి శోకపోషకము మాత్రముగా నుండి విశ్రాంతమగుటచేత దానికి స్థాయిత్వము లేదు కావునను, రతిపోషిత మగు శోకమునకే స్థాయిత్వ ముండుటచేతను కరుణరసమునకే ప్రాధాన్యము. పరిపూర్ణవిశ్వాసవతియు, పూర్ణగర్భయునై బహిఃప్రాణమే యనదగు సీతాదేవిని మిక్కుటముగా లాలించి, (పిమ్మట) అపరాధమే లేక కానలపాలు చేసిన శ్రీరామభద్రుని హృదయమందు శోకమునకంటె వేరగు భావము ప్రతిష్ఠ పొంద లేదు. ఇట్లనుటచేత జీవించియుండలేదను నిశ్చయమున్ననే కరుణరసమనెడి నిర్ణయము నిరస్తము. అట్టి నిర్ణయము లేకున్నను దానికి (కరుణరసమునకు)

---

48 ఇట సందేహప్రసక్తి లేకుండుటకై కొంది పంక్తులు వ్రాయవలసియున్నది. ఈ శ్లోకములో వర్ణితుడు జగన్నాథుడని కొందరు భ్రమసిరి. అది సరికాదు. పై శ్లోకములో వర్ణితుడగు విద్వాంసుడు జగన్నాథపండితరాయుల తండ్రియగు పేరుభట్టు. ఆయన పలువురు పండితులనుండి పలువిద్యలు నేర్చియుండుటచేత తండ్రిగురువుల నందరిని జగన్నాథుడు పేర్కొనెను. కాని జగన్నాథుడు ఏకగురుకుడే. చూడుడు - 'తం వందే పేరుభట్టాఖ్యం లక్ష్మీకాంతం మహాగురుమ్' అని అందరివల్ల అన్నివిద్యల నేర్చిన తండ్రినుండియే సకలవిద్యలు పండితరాయులు నేర్చినాడు. అందువలన గుర్వంతరనిర్దేశము చేయులేదు. ఉన్నచో చెప్పియుండడా? కనుకనే తండ్రిని గురు వనక "మహాగురు" వనినాడు.

-రసగంగాధరము - 1-2.

49 మహావీరచరితము - 1-3.

ఔచిత్యప్రాప్తి చెప్పబడియున్నది. ఎచ్చట భవిష్యత్కాలికసమాగమనిశ్చయ మున్నదో అదియే ప్రవాసవిప్రలంభాదులకు విషయము. కనుకనే మృతిచెంది వాడను నిశ్చయమున్నను చంద్రాపీడుని గూర్చిన మహాశ్వేతావాక్యములందు (సమాగమనిర్ణయ మున్నందున) విప్రలంభమే యంగీకృతము.

ఇక, కరుణరసమే ప్రధానమగుచో, అది యెట్లు పుత్త్రాదివిషయకరుణ కంటె హృదయంగమత్వమందు అత్యంతభిన్నమై యనుభవింపబడుచున్నది ? – అను ప్రశ్నకు "ఈ కరుణము రతిపోషితమగుటచేతను రతివ్యంజకమగు సామగ్రిచే వ్యంజితమగు చేతను" అని సమాధానము. కనుకనే రతివ్యంజక సామగ్రీవ్యంజితత్వముచే సంపాదితమగు మహిమ గల ఈ కరుణరసము వేరొక కరుణరసమును మాత్రమే కాదు, మరి యుద్ధవీరాదిరసములను గూడ తనదు హృద్యతాగుణముచేత అతిశయించుచున్నదనియు సదుపదేశ బహుళముగా నున్నందునను శృంగారరసప్రధానములగు రూపకములకంటె కరుణరసప్రధానమగు నాటకమే మేలైనదనియు, "ఉత్తరే రామచరితే భవభూతి ర్విశిష్యతే" అని సహృదయలోకమున విస్తృతప్రచార మున్నది" అనియు తెలియునది.

ఇట కొంచెము విమర్శించుకొందము. "విస్రంభపాత్ర యగు ప్రేయసిని కారణలవము కూడ లేకయే అరణ్యములకు పంపుట రఘు నందనునియందు శోకము నెట్లు పోషింపకుండును? అని నుడివితిరిగదా? అచ్చట అనౌచిత్యమేర్పడకుండుటకై మేము శోకాత్యంతాభావమును చెప్పము. మరి, కలిగిన శోకమునకు, అవిచ్ఛిన్నముగా నెలకొనియున్నదియు, తరువాత కూడ ననువర్తించునదియు, పరస్పరాలంబనము కలదియు నగు రతిభావ మునకు అంగత్వమునే సప్రతిజ్ఞముగ చెప్పుచున్నాము. "[50] హృదయం త్వేవ జానాతి ప్రీతియోగం పరస్పరమ్" (పారస్పరికప్రేమబంధమును హృదయమే తెలియును.) మున్నగు వాక్యములచే ఆ రతిని కవియే వ్యక్తీకరించినాడు. అట్టి రతి భగవద్రామచంద్రుడు ధీరోదాత్తుడగుటచేత ప్రచ్ఛన్నమై యుండుటవలన సీతారాముల రతి 'నీలీరాగ'మని ఆలంకారికలోకమున ప్రసిద్ధము. ఆ నీలీరాగమిట్లు నిరూపింపబడినది-

"శ్రేష్ఠో మాంజిష్ఠరాగః స్యా న్నీలీరాగస్తు మధ్యమః,
కుసుంభరాగః కవిభి రధమః పరికీర్తితః "

---

[50] ఉత్తరరామచరితము 6-32

నీలీరాగస్తు యస్సక్తో నాపైతి న చ దీప్యతే" అని.

[కవులు మాంజిష్ఠరాగ మని, నీలీరాగ మని, కుసుంభరాగ మనియు అనురాగ మును మూడువిధములుగా విభజించిరి. అందు మాంజిష్ఠరాగము శ్రేష్ఠము. నీలీరాగము మధ్యమము. కుసుంభరాగ మధమము. అందు నీలీరాగము అంటుకొనినచో తొలగిపోదు, ఎక్కువగా (ఆడంబరముగా) ప్రకాశింపదు.]

ఆ రతిభావము చిత్రపటదర్శనసందర్భమున, జరిగిపోయిన వీరకృత్య ముల యనువాదముచే సముద్దీపితమై "[51] తవ స్పర్శే స్పర్శే మమ హి పరిమూఢేంద్రియగణః వికారః" [నీ ప్రతిస్పర్శయందును(స్పర్శ కలుగగా) మైకము క్రమ్మిన సకలేంద్రియములు గల నాలోని యొక వికారము- - -] అని ప్రకాశితమై మోహ మను సంచారిభావముచేత పోషితమైనది.

"[52] అపి జనకసుతాయాస్తచ్చ తచ్చానురూపం
స్ఫుటమిహ శిశుయుగ్మే నైపుణోన్నేయ మస్తి,
నను పునరివ తన్మే గోచరీభూత మక్ష్ణో
రభినవశతపత్రశ్రీమదాస్యం ప్రియాయాః."

[జనకతనయకు అనురూపమైనట్టి (పోలునట్టి) ఆ యా విషయములు ఈ శిశువుల (లవకుశుల) జంటయందు నైపుణ్యముతో నూహింపదగినవై యున్నవి. అప్పుడే వికసించిన నూరురేకుల కమలమువలె వెలుగొందు నా ప్రియురాలి మోము మరల నా కన్నులముందు గోచరమగుచున్నది.]

అని ప్రకటితమైన స్మృత్యనుసారముగ ప్రకాశితమగు ప్రాప్త్యాశ సీతాసమాగమముతో నిర్వహింపబడి ప్రబంధసమాప్తిపర్యంతము నిబంధింప బడినది. నిర్వేదగ్లాన్యాదిసంచారిభావములు తదంగములై పుష్టినొందుచున్నవి. కావున స్థాయిత్వము ప్రబంధపరిసమాప్తివరకు ఎడతెగక సాగుచున్న రతికే చెప్పవలెనుగాని మధ్య మధ్య ప్రసారవిచ్ఛేదము నొందుచున్న శోకమునకు కాదు. ఇట్లనుటచేత "శోకమునకంటె వేరగు భావము స్థాయిత్వము పొందుట కర్హము కాదు"- అనుమాటకు సమాధానము చెప్పబడినది. భావిసమాగమనిశ్చయముతో కూడిన విరహవ్యథావర్ణనకు ప్రవాసవిప్రలంభత్వ మంగీకరించినచో నిక కరుణ

---

[51] ఉత్తరరామచరితము - 1-28

[52] అందే - 6-19

విప్రలంభము నిర్విషయ మగును. ప్రవాస విప్రలంభమునకంటె కరుణవిప్ర లంభమునకు భేదమును అభిజ్ఞు లంగీకరించుచున్నారు. మేఘసందేశవ్యాఖ్య యగు (మల్లినాథుని) సంజీవనిలో నిట్లున్నది - "పూర్వానురాగ మానాఖ్య ప్రవాసకరుణాత్మనా, విప్రలంభశ్చతుర్ధా" (పూర్వానురాగ రూప మనియు, మానాత్మకమనియు, (మానము స్త్రీలయందు ఈర్ష్యవలన నేర్పడు కోపము) ప్రవాసరూప మనియు, కరుణాత్మక మనియు నాలుగు తెరగులు) అని.

కావ్యాలంకారమున (రుద్రటునిది)

"[52] కరుణస్స విప్రలంభో యత్రాన్యతరో మ్రియేత నాయకయోః,
యది వా మృతకల్పస్స్యాత్ తత్రాన్యస్తద్గతం ప్రలపేత్".

[ఎచ్చట నాయికానాయకులలో నొక్కరు మృతులౌదురో, లేదా మృత కల్పులు (చచ్చినవారితో సమానులు) అగుదురో అచ్చోట కరుణవిప్రలంభము. ఉన్నవారు లేనివారినిగూర్చి దుఃఖింతురు.]

ఈ విషయమే శృంగారతిలకమున విమర్శగా చెప్పబడినది.-

"విప్రలంభాభిధానోఽయం శృంగారస్స్యాచ్చతుర్విధః
పూర్వానురాగో మానాఖ్యః ప్రవాసః కరుణస్తథా."
యత్రైకస్మిన్విపన్నేఽన్యో మృతకల్పేతి తద్గతమ్
నాయకః ప్రలపేత్త్వేష్టా కరుణోఽసౌ స్మృతో యథా.
గ్లానో ముక్తాశ్రు రుద్విగ్నః స్రస్తాంగో ముక్తచేతనః,
సచింతో దైన్యభాగస్మిన్ ఏవమ్ప్రాయో జనో భవేత్.
కేషాంచిత్కరుణభ్రాంతిః కారుణ్యా దత్ర జాయతే
ఏతస్య మిథునావస్థాం విస్మృత్య రతిమూలజామ్.
తస్మా చ్ఛృంగార ఏవాయం కరుణేనానుమోదితః
సౌందర్యం సుతరాం ధత్తే నిబద్ధో విరళం బుధైః." అని.

[విప్రలంభశృంగారము పూర్వానురాగ-మాన-ప్రవాస-కరుణోపాధులచేత నాలుగు విధములు. ఎచ్చట (ఇరువురిలో) ఒక్కరు విపత్తి నొందగా వేరొకరు నాయిక మృతకల్ప యగుట ఆమెనుగూర్చి ప్రణయాతిరేకమున విలపింతురు. ఇదియే కరుణవిప్రలంభము. నాయకుడు బలము కోల్పోయినవాడై కన్నీరు కార్చువాడై, ఉద్రేకము చెందినవాడై, శిథిలాంగుడై, చైతన్యము కోల్పోయినవాడై,

---

[52] రుద్రటుని కావ్యాలంకారము. 14-34

చింతాక్రాంతుడై, దీనుడై - ఈ తీరున నుండును. ఇట రతిమూలకమగు నితని పునస్సమాగమమును మరచి కారుణ్యము గాంచిన కొందరి కిచట కరుణరసభ్రాంతి కలుగును. కావున కరుణచే పోషింపబడిన శృంగారమే యిది. అరుదుగా కవులచే నిబంధింపబడిన ఈ కరుణ విప్రలంభ శృంగారము మిక్కుటమగు సౌందర్యము వహించును.]

ఇచట ప్రవాసమున కంటె కరుణవిప్రలంభమునకు భేదము, కరుణభ్రాంతి నివారణపూర్వకముగ శృంగారత్వస్థాపనము స్ఫుటమగుచున్నది.

అందువలన ఇచట విపన్నప్రాయ యగు సీతాదేవినిగురించి విల పించుట వలనను, దేవీసంప్రాప్తిని వర్ణించుటవలనను కరుణవిప్రలంభమే యని సిద్ధించినది. ఇట్లగుట 'ఏకో రసః కరుణ ఏవ', 'రామస్య కరుణో రసః', 'జర్ఘరాః కరుణోర్మయః ' - మున్నగు స్థలములందలి కరుణశబ్దములు 'ప్రవాసః కరుణస్తథా' మొదలగు స్థలములందువలె కరుణవిప్రలంభ శృంగార బోధకము లనుట వ్యాఖ్యానింపబడినది.

ఇంత చెప్పినను వా రీ నాటకమునందు కరుణరసప్రాధాన్యమునే యభిమానింతురేని, వారు శాకుంతలమునందును అదియే ప్రధానమని యంగీకరింతురుగాక!ఈ రెండిటి మధ్య (ఉత్తరరామచరిత-శాకుంతలముల మధ్య) నున్న భేదము నిరూపింపరానిది. ఆ సంగతియే నిరూపింతుము. అవధరింపుడు-

దుష్యంతుడు గూడ రఘుపతి వలెనే పరిణయమాడిన గర్భిణిని నిర్హేతుకముగ పరిత్యజించెను. మహనీయమగు పూరువంశమున బుట్టి శిష్టులచే శిక్షితుడై దండధారియై న్యాయరక్షకుడై యుండి మునిజనవశవర్తినియై ధర్మారణ్యమందున్న ఎవ్వతెనో ఒక కన్నియను తానుగా దాపుజేరి గాంధర్వ వివాహమునకు సమ్మతింపజేసి "[54] పరిగ్రహబహుత్వేఽపి ద్వే ప్రతిష్ఠే కులస్య మే" మున్నగు ప్రతిజ్ఞలు చేసి, ఎట్లో నమ్మిక కలిగించి, మునిశాపభీతి నుజ్జగించి యనుభవించి, రెండు మూడుదినములలో తన యింటికి పిలుచుకొని పోయెద నని ప్రతిన చేసి మరలి పోయిన దుష్యంతుడు, గౌరవార్హుడును, ఆప్తతముడును, భగవంతుడును అగు కణ్వమహర్షి యానతిమేరకు వహ్నికల్పులగు శిష్యులచేత ఆనీతయు, నెలలుపైబడిన గర్భభారముచే ఆయాసితయు, కడచిన వెనుకటి

[54] శాకుంతలము - 3-17

గాథలు త్రవ్వి నమ్మిక కలగింప గడగినదియు నగు శకుంతలను నిష్కారణముగా నిరాకరించుట శోకమును పోషించుటలేదా? దుర్వాసశాపముచేత, విస్మృతి కలిగినందున దాని కవకాశము లేదన్నచో అప్పుడు రతియు విచ్ఛిన్నమగుటచేత రసమే భగ్నము కాగ మూలములకే హాని. అందువలన మునుపు చక్కగా పోషింపబడిన రతికి మధ్యలో విచ్ఛేదమేర్పడుటచేత నది నిష్ప్రయోజన మని యంగీకరింపవలెను. అట్లే కవి "అనిర్వర్ణ్యం పరకలత్రమ్" (పెరవాని పెండ్లామును వర్ణింపరాదు) అని వ్రాయుచు చూచుచున్నపుడు కూడ (దుష్యంతునికి) తటస్థభావమునే ప్రకటించెను. అంగుళీయకము కాంచిన వెంటనే గుర్తింపు కలిగినందున మునుపు చెప్పిన దోషమున కవకాశము లేదనుట భావ్యము కాదు. అయినను "తద్దోషతాదవస్థ్యమే." మునుపు చెప్పిన దోషము చెక్కు చెదరక అట్లే యుండును. స్మరణానంతరము కూడ శోకమునకే ప్రాధాన్య మౌచిత్యప్రాప్తము. ఈ సంగతిని, అనగా కరుణప్రాధాన్యమును కవి స్వయముగా ఇట్లావిష్కరించినాడు, పరికింపుడు.

> [55] ఇతః ప్రత్యాదేశాత్స్వజన మనుగంతుం వ్యవసితా
> తతస్తిష్ఠేత్యుచ్చైర్వదతి గురుశిష్యే గురుసమే,
> పునర్దృష్టిం బాష్పప్రసరకలుషా మర్పితవతీ
> మయి క్రూరే యత్తత్సవిషమివ శల్యం దహతి మామ్".

[నేను నిర్దయుడనై నిరాకరింప, ఇటనుండి తనకు తోడుగా వచ్చిన తమవారిని అనుసరింప గడగినది. అంతట గురుతుల్యుడగు గురు (కణ్వ) శిష్యుడు 'నిలువుము' అని బిగ్గరగా గదురగా 'బిక్కుజిక్కున' యా బేల మరల క్రూరుడ నగు నామీదనే, కన్నీరొలుక కలకబారిన తన దృష్టిని ప్రసరింపజేసినది. అది విషాక్తమగు శల్యమువలె నన్ను దహించివేయుచున్నది.] [56] ఇట్లున్నను విచ్ఛిన్నమగు రతికే ఎట్లెట్లో సంబంధము కల్పించి శృంగారమునకే ప్రాధాన్య మంగీకరించినయెడల అప్పుడు అచ్చటకూడ "సంచారిణ్యా రతేః" అనెడి కారికోప దేశము మైత్రీనిర్బంధము మాత్రమే. కావున ఆ కారికను మనమిట్లు మార్చవలెను-

---

[55] ఈక్రింది ఆరు పంక్తుల భావము స్ఫుటము కాలేదు. మూలలిఖితప్రతిలో ఏదో వ్రాతతప్పు ఉన్నది. ఉన్నదొక్క ప్రతియే. వేరు ప్రతి లభ్యము కాలేదు.

[56] శాకుంతలము 6-9

విచ్ఛిన్నాయా అపి రతే ర్యోగా త్తచ్ఛే న్మహీయతే,
తతోఽపి స్థాయి రధికం(?) ప్రకృతం న కిముత్తమమ్" అని.

నాయిక జీవించియున్నదను నిశ్చయము లేకపోవుట రెండుచోట్ల సమానమే.

"[57] స్వప్నో ను, మాయా ను, మతిభ్రమో ను,
క్లిష్టం ను తావత్ఫలమేవ పుణ్యమ్,
అసన్నివృత్త్యై తదతీతమేవ;
మనోరథానా మతటాః ప్రవాహాః".

[దుష్యంతుని మాటలివి. శకుంతలాదర్శనసంభాషణాది వృత్తాంతము కలయా? మాయాకల్పితమా? మతిభ్రమయా? లేక పూర్వజన్మార్జిత సుకృతము అంతమాత్రము (స్వల్పము) ఫలమునే యిచ్చి అంతటితో లుప్తమైనదా? ఆ దర్శనాదికము మరల సంభవింపని రీతిగ గడిచియే పోయినది. (ఇట్టి సందర్భమున గూడ ప్రత్యాశ కలిగి యుండుట అయుక్తము) కాని మనోరథముల ప్రవాహములకు గట్లు లేవు. అడ్డుకట్టలు లేవు.]

"[58] అస్మాత్పరం బత! యథాశ్రుతి సంభృతాని
కో నః కులే నివపనాని కరిష్యతీతి,
నూనం ప్రసూతివికలేన మయా ప్రసిక్తం
ధౌతాశ్రుశేషముదకం పితరః పిబంతి."

["దుష్యంతునకు పిమ్మట వేదోక్తవిధానమున తర్పణోదకములను, మనకులమందున పుట్టినవా డెవ్వడివ్వగలడు?" అనుచు దురపిల్లుచు పితరులు సంతానరహితుడనైన నాచే తర్పణముచేయబడిన నీటిలో కన్నీటిని కడుగగా మిగిలియున్న నీరు మాత్రమే త్రాగెదరు.]

అని అతివేలదుఃఖమగ్నుడగు నాయకుని వచనములందు ప్రాప్త్యాశ యెట్లు నిర్వహింపబడును? ఇట్లు ప్రాప్త్యాశావిచ్ఛేదమునే ప్రకాశపరచుటచేత రతికి విచ్ఛేదము లేదనుటయు (రతి అనుస్యూతమై యున్నదనుట). కాన ప్రవాసశృంగారమునకు ప్రాధాన్యమనుటయు ప్రత్యాఖ్యాతము. 'అట్లుకాదు,

[57] శాకుంతలము 6-10

[58]. శాకుంతలము 6-25

ఇచ్చుట పునస్సమాగమము సంభవించుటచేత శృంగారప్రాధాన్యము నిర్వహింపబడినది అని యందురేని అది యచ్చట కూడ (ఉత్తరరామచరితము) సమానమే.

శాకుంతలమునకు, ఉత్తరరామచరితమునకును వ్యత్యాస మింతమాత్రమే- శాకుంతలమున అప్పుడే కనిపించిన నూతననాయికయందు అనురాగము వర్ణింపవలసియుండుటచేత మొదట పూర్వానురాగవర్ణనము, పిమ్మట సంభోగశృంగారసూచనయు, తరువాత విప్రలంభశృంగారవర్ణనము కడపట పునస్సమాగమము. ప్రకృతనాటకమందు పూర్వానురాగప్రాప్త్యాదులు పూర్వచరితమందే గడచిపోవుటచేత విప్రలంభశృంగారమే వర్ణనీయమగుట వలన రతిభావానుస్యూతి చూపుటకై సంభోగవర్ణన మావశ్యకమగుటచేత ఆ సంభోగమునకు ప్రబంధములందు సూచనామాత్రమే ఔచిత్యప్రాప్తమగుటచేతను చిత్తరువుల ప్రదర్శన కల్పించి సూచనామాత్రముగనైనను సాక్షాద్వర్ణనము, అటుపై విప్రలంభము, చివర సమాగమము. ప్రకృతమున సీతారాముల యనురాగమునకు సీతాపరిత్యాగమువరకు కొనిపోయెడి అవాంతరసంఘటనల చేతకూడ విచ్ఛేదరాహిత్యప్రదర్శన, నడుమ పరస్పరవిరహపరితప్యమాన హృదయులైన నాయికానాయకులయెడ విప్రలంభభూమికను విడనాడని ట్టిదియు వైచిత్ర్యవిశేషశోభయునైన అన్యోన్యసంస్పర్శాదిరూపసంభోగశృంగార నిర్వాహ మొక యద్భుతసన్నివేశము. వేరగు వైశిష్ట్యములను గూడ అవసర మేర్పడినపుడు నిరూపింతుము.

ఇది గాక-జానకి సజీవ యను నిర్ణయము లేనిచో ఆమె ప్రతిమను ముందుగ స్థాపించి, అశ్వమేధాదుల యనుష్ఠానమునందు విధురునకు (పత్నీరహితునకు) అధికారము కల్పించుటచేత ధర్మమార్గమునకు విరోధ మనివార్య మగు నను నీ సంగతి ఆ సహృదయులే తెలియుదు రని ఆ విషయమున మాకు నిరూపణభారము లేదు. అందుచేత సకలచరాచరప్రభువై ధర్మసంరక్షణకయియే యవతారమెత్తినవాడును, చారనేత్రుడును అగు భగవ ద్రామచంద్రునకు సీతావృత్తాంతము బాగుగ తెలియునని యాగోపక్రమమే విశదపరచుచున్నది. ఆ సమాచారమునే "[59] లోకోత్తరాణాం చేతాంసి కో ను నిర్జ్ఞాతుమర్హతి"(లోకాతిక్రాంతమహిమ గలవారి చిత్తములను ఎవ్వడు చక్కగా నెరుగగలడు?) అని సూచించినాడు.

---

[59] ఉత్తరరామచరితము (విష్కంభము) 2-7.

అందువలన నిది శృంగారరసప్రధానమే. ఇంతయే గాక సంధ్యంగాది ప్రదర్శనమార్గమునను దీనిని నిరూపింతుము. మహాకవి భవభూతి -"[60]. యథా స్త్రీణాం తథా వాచాం సాధుత్వే దుర్జనో జనః" (స్త్రీల సాధ్వీత్వమున నెట్లో, వాక్కుల సాధుత్వవిషయమునగూడ జనులు దుర్జనులే (ఖలులే) అనుచు విప్రలంభమును సామాన్యరూపమున ప్రస్తావించి "[61] దేవ్యామపి హి వైదేహ్యాం సాపవాదో యతో జనః" (దివ్యగుణాన్వితయగు విదేహరాజతనయ సీత విషయమునగూడ జనులు నిందారోపణ చేయుచున్నారు.) అనుచు దానినే విశేషవిషయకముగ జేసి "యది పునరియం కింవదంతీ మహారాజం స్పృశేత్, తతః కష్టతరం స్యాత్, సర్వథా దేవా ఋషయశ్చ స్వస్తి కరిష్యంతి" (ఈ జనాపవాదము మహారాజును స్పృశించుచో, అంతట నది మిగుల కష్టమగును. దేవతలును ఋషులును అన్నివిధముల శ్రేయమును కలిగింతురుగాక!) అనుచు విప్రలంభమును పునస్సమాగమపర్యవసాయిగా సూచించుచు విప్రలంభశృంగారవర్ణనకై రతి విచ్ఛిన్నము కాకుండుట అవశ్యకర్తవ్యమగుటచేత సంభోగశృంగారధారతో చిత్రప్రదర్శన ప్రకరణమున "దృఢసౌహార్దస్త్వమ్-"[సుస్థిరమైన ప్రేమగలవాడవు నీవు] అను నిట్టి మాటలచే దానినే ప్రతిపాదించుచు "భగవతి వసుంధరే, శ్లాఘ్యాం దుహితర మవేక్షస్వ జానకీమ్" [పూజ్యురాలవైన భూదేవీ, శ్లాఘనీయ యగు నీ పుత్రిక జానకిని పరిరక్షించుకొనుము.] మొదలగువానిచే అనువర్తింపజేయుచు కుశలవుల జననము మున్నగు వృత్తాంతములను చూపుచు, ప్రకృతమైన రతిభావమును హిరణ్మయిమైన సీతాదేవిని స్థాపించుటను జెప్పి పరిపాలించుచు ఆబిడ జీవించియే యున్నదను నిశ్చయమును మరల ప్రాప్త్యాశానువృత్తిని సూచించుచు విప్రలంభసంబంధులగు నిర్వేదాదిసంచారిభావములను వర్ణించుట చేత ప్రయత్న-బిందు సమన్వయరూపమగు ప్రతిముఖసంధి నారంభించెను. నడుమ తమసా-మురళా-లోపాముద్రలు ఈ మిథునమును అనుగ్రహించు నట్లు వర్ణించుటచేత ఆ బీజమునే పరామర్శించుచు "విమానరాజ, అత్రైవ స్థీయతామ్ ---- ఝడితి ఉచ్ఛ్వాసయతి --- "[విమానరత్నమా, ఇచటనే ఆగుము ---------- వెంటనే ఊరడించుచున్నది] అని యారంభించు సందర్భముచేత నిష్కారణముగా విడివిపుచ్చుటచేత వ్యథితురాలైన సీతాదేవి

[60] అందేప్రస్తావన-5

[61] అందే ప్రస్తావన 6.

నూరడించుచు "న ఖలు వత్సలయా సీతాదేవ్యా ऽభ్యుపపన్నోऽస్మి "[వాత్సల్యముగల సీతాదేవిచేత అనుగ్రహింపబడలేదుగదా?]-- మున్నగు వాక్యములచేత రామచంద్రునకు సీతాదేవియెడల అనురాగ మవిచ్ఛిన్నమని తెలియజేయుచు, "నూనం సంకల్పాభ్యాసపాటవోపాదాన ఏష భ్రమః. క్వాऽసౌ దురాత్మా యస్సీతాదేవ్యాః పుత్త్రికం వధూద్వితీయ మభిభవతి- "[నిజముగా నిది మరల మరల సంకల్పించుటయొక్క ప్రభావముచే నేర్పడిన భ్రమ ---- ఆ దుష్టాత్ముడెక్కడ? సీతాదేవియొక్క పెంపుడుకొడుకైన, తన వధువుతో విహరించుచున్న కలభమును అవమానించువాడెవ్వడు?] అని ఒక్క క్షణము తరగని సీతానురాగము గలవానినిగాను, కుటుంబప్రేమ చెరగని వానినిగాను చూపుచు, "లోకో న మృష్యతి-- స ఏవ జానాతి కిమపి. న ఖలు భవతాం స్థానం దేవ్యా గృహేऽభిమతమ్----" [లోక మోర్వదు. అదేదియో ఆ లోకమే యెరుగును (పౌరజానపదులారా!) సీతాదేవి యింట నుండుట మీ కభిమతము కాదు కదా!] అను మాటలచేత లోకమును నిందించుటచేత ఆ ప్రేమనే ఆవిర్భవింపజేయుచు [62] త్రస్తైకహాయనకురంగవిలోలదృష్టిః" [బెదరిన, ఒక సంవత్సరము ప్రాయము గల జింకయొక్క చూపుల వంటి చూపులు గలది.] అనుచు విరహవ్యథోన్మాదమును పెంచుచు, "కిమన్యత్ ప్రాప్తా పునరపి జానకీ" [వేరేమి! మరల జానకి పొందబడినది] అని ఆయనను ఊరడింపుచు, కియచ్చిరం వా మేఘాంతరేణ పూర్ణిమాచంద్రదర్శనమ్? [మేఘాంతరితుడగు పూర్ణిమాచంద్రుని దర్శన మెంతసేపు?] అని సాక్షాత్తుగ సమాగమాశను నిబంధించుచు "[63] అవని రమరసింధు ---- - త్వయి వితరతు భద్రం భూయసే మంగలాయు" [భూదేవియు గంగాదేవియు నీయెడ పెక్కు మంగళము లొడగూర్చెదు శ్రేయమిచ్చు గాక!] అని సాక్షాత్తుగానే వారి పరస్పరప్రాప్తిని సత్యాశీర్వచనుల ముఖమునుండి వెలువరించుచు, ఈ ప్రాప్త్యాశను కుశలవకథావర్ణనరూపమగు పతాకావృత్తాంతముతోడ జోడించుచు జనకుడు అరుంధతి మున్నగు పెద్దల శ్లాఘనముచేత పరిత్యాగహేతువగు శంకను సమూలముగ నున్మూలించుచు, చిత్రదర్శనసమయమున జేసినట్టి అస్త్రానుగ్రహమహిమచేత కుశలవులకు ఆజన్మసిద్ధదివ్యాస్త్రసంపన్నతను, శ్రీరా

---

[62] ఉత్తరరామచరితము 3-23

[63] అందే. 3-43

మభద్రునకు నమ్మిక కలిగింప నుపయోగపడురీతిగ వర్ణించుటకై వారి (కుశలవుల) స్వరూపస్వభావగాంభీర్యాదులను వర్ణించుచు విలోభముచేత ఆ యర్థమునే పరామర్శించుచు, సైనికులను బంధించుటచేత విద్రవమును "[64] వృద్ధాస్తే న విచారణీయచరితాః" [వారు పెద్దలు, కాన వారి చరితమును విమర్శింపరాదు.] అను మాటలచేత ద్రవమును, మహాపురుషదర్శనమాత్రముననే ఏర్పడిన విరోధశమనముచేత 'శక్తి'ని "నను జ్యేష్ఠతాతపాదాః" [పెద్దనాయనగారు గదా.] మొదలగు వచనములచేత ప్రసంగమును, "[65] దత్తేంద్రాభయదక్షిణైః [దేవేంద్రునకే అభయరూపదక్షిణ నిచ్చినట్టి] మొదలగు మాటలచేత వ్యవసాయమును-

"[66] అహో! ప్రశ్రయయోగేఽపి గతిస్థిత్యాసనాదయః,
సామ్రాజ్యశంసినో భావాః కుశస్య చ లవస్య చ."

"[67] చిరం ధ్యాత్వా ధ్యాత్వా నిహిత ఇవ నిర్మాయ పురతః,
ప్రవాసేఽప్యాశ్వాసం న ఖలు న కరోతి ప్రియజనః.

[ఆశ్చర్యము! వినయసంబంధమున్నను కుశలవుల నడిచెడు, నిలచెడు, కూర్చొనెడు తీరు మున్నగునవి సార్వభౌమత్వసూచకములుగా నున్నవి.

పెద్ద కాలము అనన్యవిషయముగా తలచి తలచి ధ్యానబలముచేత నిర్మించి యెదుట నిల్పినట్టి ప్రియజనము ప్రవాసకాలమందును ఊరడింపు కలిగింపకమానదు గదా?]

అని ముగియు గ్రంథముచే 'సిద్ధామంత్రణముచేత భావిదర్శన హేతువగు ప్రరోచనను స్వీకరించుచున్నవాడై, "వసిష్ఠో వాల్మీకిః" అని యారంభమై "గంగాదేవ్యాం విముంచతి" అనునంతవరకు గల గ్రంథముచే సంధిని, "చారిత్రోపచితాం కల్యాణసంపద మధిగచ్ఛ." లక్ష్మణః- దిష్ట్యా! అనుగృహీతాః స్మః [చారిత్రశుద్ధితో సంపాదింపబడిన కల్యాణసంపత్తిని, (లక్ష్మణుడు – భళీ! అనుగ్రహింపబడితిమి] అని గ్రథనమును, "న పునర్న

---

[64] అందే 6-31

[65] అందే 5-11

[66] అందే 6-16

[67] ఉత్తరరామచరితము 5-35

జానామి సీతాస్నేహం రామభద్రస్య" [రామభద్రునకు సీతపైని నెయ్యము నెరుగుదును].

68 "దహ్యమానేన మనసా దైవాద్వత్సాం విహాయ సః,
లోకోత్తరేణ ధైర్యేణ ప్రజాపుణ్యైశ్చ జీవతి."

"జగన్మంగల మాత్మానం కథం త్వ మవమన్యసే."

[విధివశమున వత్సను విడచి దహ్యమానహృదయుడగు రాముడు, లోకాతిక్రాంతమగు గుండెదిటవుతోడను, ప్రజల పుణ్యములచేతను బ్రదికియున్నాడు. జగత్తు కంతటికిని మంగళ మొడగూర్చెడి నిన్ను నీ వెందులకై అవమానించుకొనుచున్నావు"] మున్నగు వచనములచే రామభద్రుని విరహవ్యథను సీతాస్నేహసంపాదితమగు పునఃప్రాప్తిని సూచించుచు పరిభాషను, "క్షుభితాః కామపి దశాం కుర్వంతి మమ సాంప్రతమ్, విస్మయానందసందర్భజర్జరాః కరుణోర్మయః" [ఆనందాశ్చర్యముల కలయికచే శిథిలములయిన, ఆకులపాటుచెందిన నా దుఃఖపు టలలు ఇప్పు డిట్టిదని చెప్పరాని దశను కలిగించుచున్నవి.] అని యానందమును "త్వరస్వ వత్సే, వైదేహి" [బిడ్డా, వైదేహి, త్వరపడుము] మున్నగు వానియందు కృతిని, "నిర్భరాస్మి ఆనందేన" [ఆనందముచే పరిపూర్ణురాలనైతిని] అని మొదలై, "కిం తే భూయః ప్రియ ముపహరామి" [నీ కింకను ఎట్టి ప్రియ మొడగూర్తును] అని ముగియు భాగముచే కావ్యసంహారమును సమర్థించుచు, సీతారాముల యితరేతరప్రాప్తిని ప్రబంధఫలముగా నిర్ణయించుచు అదియే ముఖ్యఫలముగా గల అనేకకథాంశములను ప్రతిపాదించుచు- "ఆరంభయత్నప్రాప్త్యాశానియతాప్తిఫలాగమాః, యథాసంఖ్యేన జాయంతే ముఖాద్యాః పంచసంధయః" అని ప్రతిపాదింపబడిన బ్రహ్మాదులచే ప్రతిపాదితమై భరతమునిచే అభివర్ణితమైనట్టి నాటకీయసంప్రదాయమునే అనుసరించెను కావున ధర్మావీరాదులకు ఇతర రసములకు ఇట సంభావనయే లేదు. మరి సీతాప్రాప్తికి వలె పుత్రసంప్రాప్తికిని ఫలత్వ మేల కారా దనుట యుక్తము కాదు. దానికి సమగ్రప్రబంధవ్యాపిత్వము లేదు గదా? * ఉపక్రమోపసంహారావభ్యాసోఽపూర్వతాఫలమ్, అర్థవాదోపపత్తీ చ లింగం తాత్పర్యనిర్ణయే" అని పూర్వతంత్రవిదులు, ఆరింటిని

68 ఉత్తరరామచరితము 7-7

* తాత్పర్యనిర్ణాయకప్రమాణములు ఆరు - 1. ఉపక్రమము, 2. ఉపసంహారము, 3. అభ్యాసము- మాటిమాటికి నొక్కి చెప్పుట, 4. అపూర్వతాఫలము, 5. అర్థవాదము- గొప్పగాచెప్పుట, 6. అనుకూలయుక్తులు.

తాత్పర్యనిశ్చయ సాధనము లని యుపదేశించుచున్నారు. (ప్రథమః కల్పే ఉ-
స్తు అనునంతవరకు గల యంశములకు సమాధానము చెప్పబడినది?)

వేరగు కొన్ని సంగతు లిచ్చట చెప్పబడుచున్నవి. నాటకమందు-
"[69] వీరశృంగారయోరేకః ప్రధానం యత్ర వర్ణ్యతే,
ప్రఖ్యాతనాయకోపేతం నాటకం తదుదాహృతమ్".
[ఎచట వీరశృంగారరసములు రెండింటిలో నొక్కటి ప్రధానముగా వర్ణింపబడునో, (ఇతిహాసపురాణాది) ప్రసిద్ధనాయకవిశిష్ట మెద్దియో అట్టి దృశ్యప్రబంధము నాటక మని యుదాహరింపబడినది.]

ఇత్యాదిలక్షణములచేత వీరశృంగారములు రెండిట నొక్కదానికే ఇట ప్రాధాన్య ముండవలె నను నియమమును కల్పించుటచేత, కరుణరసమునకు ప్రాధాన్య మేల యుండరాదను శంకకే యిం దవకాశము లేదు.ప్రాచీను లెవ్వరును ఈ రెండిట నొక్కదానికి ప్రాధాన్య మిచ్చుటను మీరలేదు. కావున ఈ నియమము ప్రాయికము (నిర్బంధములేదు) అని చెప్పజనదు. శమప్రధానములగు ప్రబోధచంద్రాదులు కనిపించుటచేత వీరశృంగారాన్యతర ప్రాధాన్యనియమము పాక్షికమే యని చెప్పవలెననుట పొసగదు. ఆ ప్రబంధమందు నాయక స్థానీయములగు వివేకాదులకు ప్రతినాయకస్థానీయములగు మహామోహాది విషయకమగు విజయోత్సాహము యుద్ధపర్యంతమగు కార్యసాధకమగునట్లు సంచార్యనుభావసాత్త్వికభావములతో పరిపోషితమై చర్వణాగోచరమగుటచేత వీరరసమునకే ప్రాధాన్యము గోచరమగుచున్నది. బుద్ధిలో నెలకొనుటకై వీరరసశైలీపరిగ్రహము చేసినను పాత్రలన్నియు శమరసోపయుక్తములై యుండుటచేత అదియే ముఖ్యతాత్పర్యవిషయమగుటచేత శమరసప్రధానత్వమే యుక్తము - అనుట ఉచితము కాదు. అట్లైనచో ఆయుర్వేదప్రక్రియను చేకొని నిబద్ధజీవనాయకమై క్షయవ్యాధినిష్కాసనమే ఫలమగు ప్రబంధమందు ముఖ్యతాత్పర్యవిషయమగు ఆరోగ్యమునకు రసాంతరత్వము నంగీకరింప వీలు లేదు కావున అచట రస మేది? అని యడిగెదము. 'వీరరసమే' యందురేని వేరొకచోకూడ (ప్రకృతమునకూడ) ఇది యంతయు సమానమే. కనుక అర్ధజరతీయన్యాయమిచట ప్రయోగించు టుచితముకాదు. ఇట్టి ప్రదేశములం దంతటను ప్రతినాయకుడు ఆలంబనవిభావముగా గలదియు, తిరస్కారాదులచేత ఉద్దీపితమయి (ఉద్దీపనవిభావముచే పెంపొందింపబడి)

[69] ప్రతాపరుద్రీయము - నాటకప్రకరణము 28

అమర్షగర్వాదిసంచారిభావములచే పోషింపబడి వ్యూహనిర్మాణాద్యనుభావముల చేత ప్రోదిచేయబడిన ఉత్సాహము స్థాయిభావముగా గల వీరరసమే సహృదయులచే ఆస్వాదింపబడుచున్నదనుట అనుభవగోచర మగుటచేత ఉపపన్నమగుట లేదా? అట్లే అచట శరదృతువును వర్ణించుటచేత " శరత్ సంగ్రామసమయే, వివాహే గ్రీష్మమాధవౌ" (యుద్ధసమయమున శరదృతువు, వివాహకాలమున వసంతగ్రీష్మఋతువులును (తగినవి, వర్ణనీయములు) అను లక్షణము ననుసరించి కవికి గూడ వీరరసప్రాధాన్యమే యభిమతమని యు నిస్సందేహముగా తెలియుచున్నది.

కావున ప్రాచీనలక్షణములను అతిక్రమింపకయే నిర్వాహము సాధ్యమగు చుండ సంప్రదాయాతిలంఘన మేల యని తలపోసి లక్షణోల్లంఘనసాహసము మే మనుమతింపము. ఇంతయే గాక ఈ రూపకమందు ప్రస్తావన తొడగి ప్రశస్తివరకు ధర్మ అర్థ కామ మోక్షములనెడు చతుర్విధపురుషార్థములందు ప్రవర్తిల్లచేసెడి సదుపదేశము లెన్నో ప్రపంచింపబడియున్నవి. నిజము చెప్పవలె నన్న-

"[70] ఆనందనిష్యందిషు రూపకేషు వ్యుత్పత్తిమాత్రం ఫల మల్పబుద్ధిః,
యోఽపీతిహాసాదివదాహ సాధు స్తస్మై నమః స్వాదుపరాఙ్ముఖాయ."

[అల్పబుద్ధిగలవా డొక్కడు రసానంద మందించెడు దృశ్యప్రబంధ ములవలన కూడ ఇతిహాసముల వలన లభించెడి లోకవృత్తపరిజ్ఞానమే కలిగెడు లాభమని చెప్పుచున్నాడు. అట్టి స్వాదుతావిముఖుడగు సాధువునకు ఇదే నా ప్రణామాంజలి.]

అనెడి సోపహాసవచనముచేత రూపకములకు వ్యుత్పత్తి మాత్రమే ఫల మనుటను ఆలంకారికులు ఖండించుచున్నారు. కావుననే విషయపరిజ్ఞానము ప్రాచీనేతిహాసములనుండియు కలుగుచుండుటచేత కథాంశాదులను గూడ మార్చుచున్నారు. విషయపరిజ్ఞాన (వ్యుత్పత్తి) ప్రవణత్వములను వదలిపెట్టక రసప్రతిపాదన చేసినను తప్పక సిద్ధించునట్టి ప్రయోజనాంతరప్రవృత్తికూడ అనుమతింపబడుచున్నది. కావుననే వ్యుత్పత్తిమాత్రమే ప్రయోజన మని అవధారణము చెప్పబడినది. (వ్యుత్పత్తిమాత్రమే కాదు, అంతకంటె ప్రధానమైన ప్రయోజన మున్నదని తాత్పర్యము.)

ఇందు తిర్యగ్జంతువులగు వానరములను కూడ గౌరవించుటవలన

---

[70] దశరూపకము 1-6

క్షుద్రుడైనను మిత్రుడు అనుసరింపదగినవాడనియు, కానలనుండి మరలి వచ్చిన వాడును, అభిలషణీయదర్శనుడును అగు రామచంద్రుని గూడ విడచి గురుజనము అల్లుని యజ్ఞవాటికకు జనెనని నుడువుటచేత గురువులను అవమానింపరా దనియు, "అనాహూతో౽ధ్వరం గచ్ఛేత్" ( పిలవకపోయినను యజ్ఞమును చూడపోవలెను.) అనియు, "దేవ్యామపి హి సాపవాదః"- (గుణములచే దీపించెడి సీతమ్మపైనను అపవాదు చెప్పుచున్నారు.) అనుటచేత తరచుగా లోకులకు గౌరవార్హులపై గూడ నిందారోపణకుతూహల ముండుట తప్పింపరాని దనియు, కాన కీర్తికాములు పొరపాటు చెందక అపవాదస్థానమును పరిహరింపవలెననియు, "[71] అగ్నిశుద్ధౌ త్వనిశ్చయః"- [అగ్నిపరీక్షయందో నిర్ణయము (విశ్వాసము) లేదు.] అనుటచేత తనమీది దూఱు తొలగించుకొనుట ఎక్కడో ఏకాంతమున గాని, దూరమందునగాని చేయదగదు, మరి దూషించువారి సమక్షముననే చేయవలెననియు "[72] సంత్యజ్య సర్వాన్కామానరణ్యే విశ్రామ్యంతి మనీషిణః "(బుద్ధిమంతులు అన్ని కోర్కెలు విడనాడి అరణ్యమందు విశ్రాంతి నొందుచున్నారు) అనుటచేత - "[73] న జాతు కామః కామానాముపభోగేన శామ్యతి, హవిషా కృష్ణవర్త్మేవ భూయ ఏవాభివర్ధతే" (కామములను అనుభవించుటచేత ఎన్నటికిని ఉపశమింపవు. హవిస్సును ప్రక్షేపించుటచేత అగ్ని పైపైన పెరుగునట్లుగ భోగానుభవముచేత కామములు పెరుగుచునే యుండును) - అట్లగుటచేత బాగుపడదలచినవాడు భోగానుభవమునందు మునిగిపోవక అంటియు నంటనట్లుండి తృప్తిని పొందవలెను. "[74] ఉపానచ్ఛన్నపాదస్య నను చర్మావృతైవ భూః" (చెప్పులచేత ఆచ్ఛాదితములైన పాదములు గలవానికి భూమియంతయు చర్మముతో కప్పబడినట్లే తోచునుకదా? అనియు, "నను రామభద్ర ఇత్యేవ శోభతే తాతపరిజనస్య" (నాయనగారి సేవకులు రామభద్ర యని పేరుపెట్టి పిలుచుటే శోభనిచ్చును.) అనుటచేత

[71] ఉత్తరరామచరితము ప్రస్తావన-6

[72] ఉత్తరరామచరిత్రము - 1

[73] మహాభారతము

[74] జల్హణుని సూక్తిముక్తావళి 128-5

మహిమాతిశయావధిలో నున్నట్టివాడైనను వినయవంతుడై యుండవలెననియు, గురుజనులపైని ఆదరము వారి వారి యభిమతవస్తుపర్యంతముగా పొందిం పవలెననియు, "లౌకికానాం హి సాధూనామ్" మొదలగు వాక్యములందు గొప్పవారు గౌరవింపబడినవారై కల్పవృక్షము వలె నుపకరింతు రనియు, విరోధింపబడినవారై భావికాలములో దుష్ఫలితముల నిచ్చెడి యాపదను కలిగింతు రనియు, "[75] స్నేహం దయాం తథా సౌఖ్యమ్" అనుటచేత లోకారాధనమే యశోధనులకు ముఖ్యమనియు, స్నేహమువెంట బడి ధర్మమునకు హాని కలిగింపరాదనియు, "[76] నైసర్గికీ సురభిణః కుసుమస్య సిద్ధా మూర్ధ్ని స్థితిః"(సువాసనల విరజిమ్మెడి పుష్పమునకు తలపై నుండుటే సహజసిద్ధమైనది) అను నిట్టి సీతోపలాలనచేత,

"జామయో యాని గేహాని శపంత్యప్రతిపూజితాః,
తాని కృత్యాహతానీవ వినశ్యంతి సర్వశః" (మనుస్మృతి. 3-58)

సోదరి, పత్ని, సుత, కోడలు మొదలగు స్త్రీలు గౌరవింపబడనివారై ఏ గృహములను అనర్థమగుగాక అని శపింతురో, ఆ యిండ్లు అభిచారక్రియతో (చేతబడివంటిది) నిహతమైనట్లు ధనపశ్వాదినాశము నొందును- అనియు, "యః కశ్చిద్గర్భదోహదోఽస్యాః, సోఽచిరా త్సంపాదయితవ్యః" (ఈబిడకు వేవిళ్లు కలుగుచో వెనువెంటనే తీర్చవలెను) అని నుడువుచు, "శ్రద్ధావిఘాతాద్గర్భస్య వికృతి శ్చ్యుతిరేవ వా" (చూలాలు కోర్కెలకు విఘాతము కలిగినచో గర్భమునకు వికృతియో స్రావమో యగును.) అని వాగ్భటు డుపదేశించినట్లు గర్భిణీకోర్కెలపై శ్రద్ధ చూపకపోవుట సమ్మతము కాదనియు, "ప్రసన్న గంభీరాసు వనరాజీషు విహరిష్యామి, పవిత్రశిశిరసౌమ్యావగాహాం భాగీరథీమ్ అవగాహిష్యే (పావనమై చల్లనై సుఖకరమైన స్నానము గల గంగానదిలో మున్కలిడుదును.) అనెడు గర్భకాలికేచ్ఛావచనముచేత పుట్టబోయెడు కుశలవుల యెడ జితేంద్రియత్వ - ధార్మికత్వములు సూచింపబడినవి. ఇది యుక్తమే. "ఆశ్రమే సంయతాత్మానం ధర్మశీలం ప్రసూయతే" (ఆశ్రమమున జితేంద్రియుని ధర్మశీలుని ప్రసవించును) అని సుశ్రుతగ్రంథమున చెప్పబడినది.

---

[75] ఉత్తరరామచరితము 1-5

[76] అందే 1- 7

ఇట్లే అట నట, శంబూకుడు తపము చేయుటచేత బ్రాహ్మణశిశువు మరణించుట సంభవించినందున ఎవ్వరైనను వర్ణాశ్రమాద్యాచారమర్యాదలను మీరరాదనియు, అట్లు మీరినచో నరపాలుడు జాగ్రత్త వహింపవలెననియు, అచటనే అతనిని వధించు ప్రయత్నముతోడ దండకారణ్యము ప్రవేశించినవాడును ఎట్లో దండ్యుని కనిపెట్టినను, అచటకూడ రామచంద్రభగవానునకు వానిపై ఖడ్గము ప్రయోగించునెడ సంశయమును వర్ణించుటచేత గొప్ప వారియొక్క కరుణాశాలిత్వము, తరువాత దండ్యులయెడ దోషమును నిరూపించి తెలిసికొన్నను ప్రభువు శస్త్రపాణియగు చికిత్సకుని వలె జగద్ధితము కొరకే దండప్రయోగము చేయవలెనే కాని క్రోధోన్మాదముచేత కాదనియు, ఇట్లు కరుణామయుడైనను రాము డాతనిని సంహరించినట్లు వర్ణించుటచేత ప్రభువు స్థిరనిర్ణయమునుండి చలింపరాదనియు, "అన్వేష్టవ్యః" ఇత్యాదివచనములచేత దండింపబడియు శంబూకుడు రామభద్రుని స్తుతించినట్లు వర్ణించుటచేత ఋషికల్పులై దండధారులగు రాజులందు భక్తిని ఎన్నడును విడనాడరాదనియు, భువనములు భగవంతుని వెదుకవలెనని నొదువుటచేత ఎల్లవారును సంసారభీతి పోకార్చుకొనుటకై లక్ష్మీవల్లభుడు స్వీయకృపావశమున ఈ లోకమున అవతరించి ధర్మమును పెంపొందించుచుండగా ఆతనిని అవమానింపరాదనియు,అందరును దహరాకాశవిహారి యగు ఆ భగవంతుని ఉపాసింపవలె ననియు, శాస్త్రవిరుద్ధముగ అనుష్ఠించిన తపస్సునకు గూడ పుణ్యలోకప్రాప్తి గలిగినదని వర్ణించుటచేత, శాస్త్రవిరుద్ధముగా చేసినను ఈ పాతకము పుణ్యలోకప్రాప్తిని నిషేధింపదు. "[77] యమేవైష వృణుతే తేన లభ్యః" అన్న చందాన భగవంతుడు స్వాతంత్ర్యముతోడ ఎవ్వనినైనను అనుగ్రహించునెడ అతని పాపము ప్రతిబంధకము కాదనియు - ఇట్టి వెన్నో ధర్మార్థకామమోక్షవిషయకములగు ఉపదేశములు లభించుచున్నవి. కాళిదాసాది రచితగ్రంథములందును ఉపదేశములు కొన్ని యున్నవి. అయినను ఈ రీతివైన మోక్షవిషయకోపదేశములు అచట లేవని తెలియవలెను.

అట్లే "అంతర్గూఢఘనవ్యథః" (లోలోపలనే కుములుచున్న దుర్భర వ్యథగలవాడు) అని, "శబ్దం మహాపురుషసంవిహితమ్" (మహాపురుషుడు పలికిన శబ్దమును (విని) ఇత్యాదులందు అనుల్లంఘనీయత్వరూపమగు

[77] ఎవనిని భగవంతుడే స్వయముగా ఎన్నుకొనునో అతనికే భగవంతుడు లభ్యపడుచున్నాడు. కఠోపనిషత్తు - 3-2-3

మాహాత్మ్యము పరిత్యక్తమైనను సీతాదేవి విషయమున పశ్చాత్తాపము కలిగి యుండుటచేత దృఢస్నేహము, ప్రణయ మత్యధికమై యున్నను అంతకంటె యశస్సునే గొప్పగా భావించెడు ఉదాత్తతయు - మున్నగు నాయకగుణములు వివరింపబడినవి. అట్టి గుణముల నుద్దేశించియే "[78] యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ" (మనసుతో గూడ పొందలేక, ఎవ్వని గుణముల నుండి వాక్కులు (వర్ణింప లేక) మరలి వచ్చునో) అని వేదవిదులు వ్యవహరింతురు. ఇట్టి పరమపురుషోత్తమవిషయత్వ మొక్కటే ఈ ప్రబంధము అన్నిటిని మించిన దనుటకు చాలినంత హేతువు. భగవదవతారము లన్నిటను రామభద్రునకు సమానుడగువా డెవ్వడుండినాడు? అందుచేతనే ఈ ప్రపంచమున ఈ ప్రబంధమునకు సాటి లేనట్లే ఈ కవితో సామ్యము పొందగల కవియు లేదు. ఈ విషయము మాచే రచితమయిన సద్రూపకప్రశంసయందు చక్కగా నిట్లు వివరింపబడినది.

"యస్య కస్యాऽపి యత్కించి ద్వస్త్వాలంబ్య ప్రవర్తినః,
కేచి, దన్యే జగద్వంద్యపుణ్యశ్లోకకథాజుషః.
యథోచితపదప్రాప్తి రేషా మాజానజా యతః,
అమీ వ్యవస్థితా స్తేన - - -"ఇతి.

[శబ్దార్థరసభావాదులలో ఏదియో ఒకదానియొక్క ఏదో ఒక విషయమును ఆధారముగా చేసికొని ప్రవర్తించువారు కొందరు కాగా, వేరగు కొందరు జగద్వందనీయుడై పవిత్రకీర్తియైన మహాపురుషుని కథను సేవించువారు. వీరికి యథోచితపదవీప్రాప్తి జన్మసిద్ధము. అందుచే వీరు వ్యవస్థితులు - అని.

చెప్పదగిన మిగిలిన విషయమంతయు అస్మదీయులగు శ్రీ కల్యాణ శ్రీనివాస తాతాచార్యులచేతనే తద్వ్యాఖ్యయందు వివరింపబడినందున నేమిచట విస్తరించుట లేదు.

ఈ నాటకమందు లోకోత్తరమాధుర్యగుణ మనుభవగోచరమగు చున్నది. మాధుర్య మనగ ఆ యా రసమునకు తగిన రచనావిధాన మాశ్రయించి తద్ద్వారా సామాజికుల హృదయమున రసోద్బోధనప్రకారవిశేషము. దీనిని ధ్వనిగ్రంథము (ధ్వన్యాలోకము మూలకారిక)-

---

[78] తైత్తిరీయోపనిషత్తు.

[79] శృంగార ఏవ మధురః పరః ప్రహ్లాదనో రసః,
తన్మయం కావ్య మాశ్రిత్య మాధుర్యం ప్రతితిష్ఠతి.

[80] "శృంగారే విప్రలంభాఖ్యే కరుణే చ ప్రకర్షవత్,
మాధుర్యమార్ద్రతాం యాతి యతస్తత్రాధికం మనః".

"శృంగార మొక్కటే మధురమై అమందానంద మొదగూర్చెడి యుత్తమరసము. తద్రసమయమగు కావ్యము నాశ్రయించి మాధుర్యగుణము ప్రతిష్ఠ నొందియుండును. (సాధారణశృంగారముకంటె) విప్రలంభశృంగారమునందును, కరుణరసమందును ఈ మాధుర్యము ప్రకృష్టమై యుండును. పూర్వపూర్వములకంటె ఉత్తరోత్తరరసములందు హృదయము అధికమగు ఆర్ద్రతను పొందియుండుటే యిట్లగుటకు కారణము" - అని చెప్పినది.

ఆలోకగ్రంథమునగూడ "విప్రలంభశృంగారకరుణయోస్తు మాధుర్యమేవ ప్రకర్షవత్" (8 వ శ్లోకముపై వివరణ) (విప్రలంభశృంగారకరుణంలయందో మాధుర్యమే ప్రకర్ష గలది) అని చెప్పిరి. ఈ విషయమే లోచనవ్యాఖ్యలో ఎట్లన - "వస్తుతః మాధుర్యం నామ శృంగారాదే రసస్యైవ గుణః. తత్ మధురరసాభివ్యంజకయోః శబ్దార్థయో రుపచరితం మధురశృంగారరసాభివ్యక్తిసమర్థతా శబ్దార్థయోర్మాధుర్యమితి హి లక్షణమ్." [మాధుర్యమన్నది వాస్తవముగ శృంగారాదిరసముయొక్క గుణమే. అది మధురరసాభివ్యంజక శబ్దార్థగతమని ఔపచారికముగ చెప్పబడుచున్నది. (లేనిదానిని ఆరోపించుట ఉపచారము) శబ్దార్థగతమగు మధురశృంగారాభివ్యక్తిసామర్థ్యమే మాధుర్యమని గదా లక్షణము.] శబ్దార్థములయందు ఉపచరితమైన మాధుర్యము తద్వ్యక్తి హేతువగు రచనయందు నున్నదని వేరొకచోట స్పష్టము చేయబడినది. ఇచట విప్రలంభశృంగారమునకును తదంగమగు కరుణమునకును సంభోగశృంగారమునకంటె మాధుర్య మధికమనుట స్ఫుటము. అభినవగుప్తాచార్యుడు - "సంభోగశృంగారాత్ మధురతరో విప్రలంభః. తతోఽపి మధురతమః కరుణ ఇతి. తదభివ్యంజనకౌశలం శబ్దార్థయో ర్మధురతరత్వం, మధురతమత్వం చేతి." అనగా - సంభోగశృంగారమునకంటె విప్రలంభశృంగారము మధురతరము, అంతకంటెను కరుణము మధురతమము అని; శబ్దార్థగతములగు

[79] ధ్వన్యాలోకము 2-7

[80] ధ్వన్యాలోకము 2-8

మధురతరత్వ మధురతమత్వములే మాధుర్యాభివ్యంజనసామర్థ్యము అనియు నిర్వచించినాడు. ఈ మాధుర్యము ఎచ్చోటనైనను క్లేశకారణమగు అప్రతీత-అపుష్టార్థ-నేయార్థాది దోషరహితములైన శబ్దార్థములను గ్రహింపక ఉచితమగు శయ్యాసన్నివేశముచే రమ్యమైనదియు ఆ యా రసములకు అనుగుణములగు గుణముల నిర్మాణమందు నిపుణమైన రీతితో ఉపశ్లిష్టమై పరిపాకవశమున ఊట లూరుచున్న ద్రాక్షాఫలరసగతమగు స్వాదుత్వము వంటి స్వాదుత్వముచేత రసనీయమగు, లోపలనంతట చిప్పిలు రసము గలిగి ప్రసన్నమైన బంధమును చేకొనుటచేత (మాధుర్యము, ఇతర-దృశ్యప్రబంధములందుకంటె ఈ ప్రబంధమున అత్యంతవిలక్షణమై ప్రతీయమాన మనుట విచక్షణుల గోష్ఠులందు అతిప్రసిద్ధము. కావున మరల చెప్పి పిష్టపేషణము చేయము.

శాకుంతలమందు గూడ ఒకానొక సందర్భమున బంధమునకు రసానుగుణత్వము లేకపోవుట కన్పట్టుచున్నది. చూడుడు-

"[81] యో హనిష్యతి వధ్యం త్వాం రక్ష్యం రక్షతి చ ద్విజమ్,
హంసో హి క్షీర మాదత్తే తన్మిశ్రా వర్జయత్యపః".

(ఓయీ, ఏ బాణము చంపదగిన నిన్ను చంపునో, కాపాడదగిన బాపని కాపాడునో (అట్టి శరమును సంధింతును). హంస పాలు మాత్రము స్వీకరించును, దానితో కలిసియున్న నీటిని విడిచిపుచ్చును గదా).

మున్నగు స్థలములను చూడుడు. ఇచట తన యనుంగు చెలికానికి ద్రోహము తలపెట్టినవానిని బెదరింప దొరకొన్నవాడును, హఠాత్సంభవము వలన సంభ్రాంతుడైనవాడును అగు రాజు మాటలలో వీరరసతరంగితమై ఓజస్విని యగు సాత్వతీవృత్తిని సంఘటించుటయే ఉపాయము. అంతే కాని శాంతమూర్తి యగు తాపసుని మాటలందు వలె మాధుర్యాదులు తగవుగదా.

భవభూతియం దిట్టి లోపము లేదు. చూడుడు-

"[82] దత్తేంద్రాభయదక్షిణై ర్భగవతో వైవస్వతా దామనోః
దృప్తానాం దమనాయ దీపితనిజక్షత్త్రప్రతాపాగ్నిభిః,

---

[81] శాకుంతలము - 6-28

[82] ఉత్తరరామచరితము 6-11

ఆదిత్యైర్యది విగ్రహో నృపతిభిర్ధన్యం మమైతత్తతో
దీప్తాస్త్రస్ఫురదుగ్రదీధితిశిఖానీరాజితజ్యం ధనుః."

[వైవస్వతమనువు మొదలుకొని సాక్షాద్దేవేంద్రునకే అభయదక్షిణ నిచ్చినవారును, గర్వోద్ధతుల నణచుటకై జ్వలింపజేయబడిన తమ పరాక్రమాగ్ని గలవారును అగు సూర్యవంశపురాజులతో యుద్ధము ప్రసక్తము కాగా, జ్వలించెడు నస్త్రముల కాంతిశిఖలచే నీరాజితమైన యల్లెత్రాడుగల నా యీ ధనుస్సు ధన్యమగు గాక!]

ఇచ్చట కుమారలవునకు రాముని సైన్యముతోడ పోరు పొసగి యుండుట విని తనకు తగినట్టి జేతవ్యవీరుడు లభించుటచేత ఉత్సాహసంప న్నుడగు కుశకుమారుని మాటలందు సూర్యవంశోద్భవప్రభువుల మాహాత్మ్య ముగ్గడించుపట్ల విస్మయస్థాయికి తగినట్టి భారతీవృత్తియు, అందునను పరాక్రమానువాదము చేయుపట్ల "దీపితనిజక్షత్రప్రతాపాగ్నిభిః" అనుచోట వీరోచితమగు రీతియు, తన యుత్సాహమును ప్రకాశపరచుటయందు "ధన్యమ్మమైతత్తతః." ఇత్యాదివాక్యములం దున్నట్టి వృత్తిసౌరభ మాఘ్రాణిం పగం రసజ్ఞులను రంజిల్లజేయగం వీరానురూపమైన సాత్వతీవృత్తియు కవి వశ్యవాక్కుని నివేదించుచున్నది. అట్లే చిత్తద్రుతిహేతువగు కరుణరసమును నిరూపించువేళ "త్వం జీవితం త్వమసి మే హృదయం ద్వితీయమ్" (నీ వే నా ప్రాణము. నీవు నా రెండవ హృదయము) ఇత్యాది స్థలములందు కైశికీవృత్తియు, "జ్యాజిహ్వయా మలయితోత్కటకోటిదంష్ట్రమ్" (నాలుకవంటి అల్లెత్రాటితో చుట్టబడిన భయంకరమైన కోరలవంటి (వింటి) కొనలు గందియు) మున్నగు నెడల సాత్వతీవృత్తి. ఈ రీతిగనే ఆ యా రసఘట్టములందు పరామర్శింపదగును. ఇట్లనుటచేత కావ్యగుణములు నిరూపితప్రాయము లగుటచేత తదర్థమై ప్రయత్నింపము. ఏలనన, శబ్దఘటనాశ్రయములే గుణములు. రీతి యనగ విశిష్టపదరచనయే. పదగత విశిష్టత గుణాత్మకమే అని వామనుడు ప్రతిపాదించినాడు గదా. అందుచేత ఆస్వాద్యత్వమునందును తారతమ్యమున్నది- అనియు విమర్శింపబడినది. ఇట్టి యుత్కర్షహేతువులగు విశేషముల పరామర్శచేతనే రసికాగ్రణి యగు భవభూతి నిర్మత్సరజనులకు ప్రథమోదాహరణమైనాడు.

మహాకవి కాళిదాసు కూడ-

"నాటకే భవభూతిర్వా వయం వా వయ మేవ వా
ఉత్తరే రామచరితే భవభూతి ర్విశిష్యతే."

[నాటకరచనయందు ఎవరెవరు నిపుణు లను ప్రశ్న రాగా, అంతట కాళిదాసు భవభూతి గాని, మేము గాని సమర్థులము - (ఇతరులు అట్టివారు కారనుట) అని కొంచెె మాలోచించి తన నాటకములు జనప్రియములై యుండుట గుర్తు రాగ, సాత్త్వికాహంకారముతోడ, కాదు, మేమే కుశలులము (ఇతరులు కారు) అని నొక్కి వాక్రుచ్చినాడు. అంతట మరి ఉత్తరరామచరితమును గమనించితిరా? అని రసజ్ఞు లెవ్వరో అడుగగా, ఔనౌను, మరచితిని. ఉత్తర రామచరితమందు భవభూతి మించి అందరికంటె మిన్నయైనాడు]

అని పలుకుచు స్వరచిత దృశ్య ప్రబంధములకంటె ఉత్తర రామచరిత ప్రాశస్త్య మంగీకరించినాడని - ఈ కథ సహృదయలోకమున ప్రతీతము. కావున రూపకాంతరముల కన్నిటికంటెను ఈ నాటకమును సహృదయులు శ్లాఘించుట రమణీయతామూలక మని నిరూపితప్రాయమే.

మాలతీమాధవ మను పేరు గల ఏతత్కవిరచిత మగు ప్రకరణము కూడ దశవిధరూపకములలో నొక భేదము. శృంగార రసప్రధానమగుట చేత, రసాస్వాదజనన చాతురీధురీణసందర్భ మగుట చేతను ఉత్కృష్ట మగుచున్నది. అందునను ఉత్పాద్యనాయకచరిత్ర గల రూపకముయొక్క నిర్మాణము కవితాచతురత్వమునకు ఒరపురాయి యని నిర్ణయింపబడుచున్నది. కవి ఉత్పాద్యనాయకునకు మాధవుడని నామకరణము చేయుట, ఈ పదమునకు ముఖ్యవాచ్యార్థమై వాచకశబ్దములలో నెల్ల ఉత్తమవాచ్యార్థరూపుడును, సర్వాంతర్యామియు, అనంతమహిమోన్నతుడును అయిన భగవంతునకు నాయకత్వప్రతిపత్తిని సూచించుటచేత అచ్చట భగవత్పరతను భావించి, మేఘదూతాదులందు వలె కులగోత్రాలు లేని నాయకుడు కలిగియుండుటను, కాదంబర్యాదులందు వలె ఆరోప్యమాణమగు దుర్బలనాయకత్వమును ధైర్యముతో పరిహరింతుము. నామసామ్యముచేత తత్ప్రతిపత్తి (నాయకునకు మాధవు డను పేరుండుటచేత ఆతనియందు విష్ణుత్వప్రతిపత్తి) పండితాంగీకృతమే. భోజమహారాజు శంకరకవిని పండ్రెండు లక్షలతో సమ్మానించినాడు. ఇట్లు చేయుటలోని భావ మేమనగా శంకరకవియందు శంకరత్వ మారోపించి, శివుడు ఏకాదశాత్ముడు కావున పదునొకండు లక్షలు శివున కనియు, ఒక లక్ష తన్నామక కవికనియు రాజు ఉద్దేశించినాడనియు చెప్పుట విందుము. అజామిళుడు (అన్యవిషయకమైనను) నారాయణనామోచ్చారణచేతనే ఉత్తమగతిని పొందెను. అన్యార్థవాచకములని నిర్ణీతమయినవానికే తద్భిన్నార్థబోధకత్వ ముండగ అనిర్ణీతాన్యసంకేతము గల

శబ్దమునకు వేరొక అర్థమును బోధించుటలో బాధకమే లేదు. ఈ శ్లోకములున్నవి-

"[83] వైదర్భీం సరసాం హృద్యగుణాలంకారభాసురామ్,
ఉపలభ్య సమైరేష గమయన్ పురుషోత్తమమ్,
మాలతీం మాధవే భక్త్యా యోజయన్ కవికుంజరః,
భవభూతి ర్గిరాం దేవీం స్థానే ఽ నన్యాశ్రయాం వ్యధాత్."

[మనోజ్ఞములైన గుణములతోడను, అలంకారములతోడను భాసిలునట్టి వైదర్భిని పొంది, అన్నిటను పురుషోత్తముని తెలుపుచు భక్తితోడ మాలతిని మాధవునితోడ కూర్చుచు కవికుంజరు డగు భవభూతి వాగ్దేవిని ఆశ్రయాంతరాపేక్ష లేనిదానినిగా (పురుషోత్తమునే ఆశ్రయించినదానినిగా) చేసెను. ఇది యుక్తము.

మాలతీమాధవమందు మన్మథావస్థావర్ణనము కొలదిని మీరి యుండుటచేత సహృదయులకు కలిగెడు నుద్వేగమును కొంత నిరూపింతుము. శృంగారప్రధానములైన శాకుంతలాదులందు ఆ రీతిగ వర్ణించుటకు ప్రతిబంధము ధీరోదాత్తనాయకుని ప్రకృతి ననుసరింపవలసియున్నందున ఏర్పడినది. ఎట్లనగా-

[84] "యథా ధీరోద్ధతే రౌద్రో వర్ణ్యతే బాహ్యసంభ్రమైః,
యథా చ ధీరలలితే శృంగారో బాహుభావకృత్,
న ధీరోదాత్తవిషయే తథా వర్ణన మిష్యతే,
మందోద్యమానుభావం స్యాత్ ధీరోదాత్తే తు నేతరి,
కార్యా ఽ తో రససంపూర్తి స్తస్మిన్నప్యుచితక్రమా".

ధీరోద్ధతనాయకవిషయమున రౌద్రరసము బాహ్యాడంబరములతోడ ఎట్లు వర్ణింపబడుచున్నదో మరియు, ధీరలలితనాయకుని విషయమున బహుభావముల స్ఫురింపజేసెడు శృంగారరసము ఏ తీరున వర్ణింపబడుచున్నదో, ధీరోదాత్తుడు నాయకుడై యుండ అట్లు మిక్కుటముగా వర్ణింపరాదు. మందోద్యమము గల అనుభావములు కలదిగా వర్ణింపవలెను. కాని అట్టి నాయకునియందును ఉచిత పరిపాటి ననుసరించి సంపూర్ణరసపోషణ

[83] గ్రంథకర్త వేమో?

[84] ప్రతాపరుద్రీయము- నాయక ప్రకరణాంతమున - (ప్రక్షిప్తము?)

చేయవలసినదే - అను నియమమున్నది. ఎచ్చట నిట్టి నిషేధము లేదో అట్టియెడ యథావత్తుగా వర్ణించుట దోషము కాదు. మరి, ఆ యా నాయకస్వభావమును ప్రకాశింపజేయుటచేత సహృదయులకు సంతోషమే కలుగును. గాన ప్రబంధమునకును తత్కర్తకును అది భూషణమేకాని దూషణము కాదు.

"న చాఽతిరసతో దూరం వస్తు విచ్ఛిన్నతాం నయేత్,
రసం వా న తిరోదధ్యాద్వస్త్వలంకారలక్షణైః."

అతిరసప్రవాహమున కొట్టుకొనిపోవుచు కథావస్తువును చాల దూరమువరకు విచ్ఛిన్నమగునట్లు చేయరాదు. (కథా) వస్తువును, అలంకారములను పోషించుటలో వ్యగ్రుడై రసమును మరుగుపరచుట యుక్తము కాదు - అను నిషేధముండుటచేత ఇది (రసమును అతిగా పోషించుట) దోషమే యనుట ఉచితము కాదు. ప్రకరణము దానికి అపవాదము. నాటకాదులందు శృంగారమును అతిగా పోషించుట దోషమగునే కాని ప్రకరణమునందు కాదు. ఈ విషయమే, "శృంగారః పరిపూర్ణత్వాత్ సూచనీయోఽతిభూయసా" శృంగారరసము పరిపూర్ణము కావలెను గాన దాని నతివిస్తృతముగా ప్రకాశింపజేయవలెను - అని చెప్పబడినది. అందుచేత మాలతీమాధవమునందు బాహ్యాడంబరప్రచురములైన శృంగారభావములను విస్తరింపజేయుట ప్రధానరసమునే పోషించుననుట యుక్తమే.

వేరగు కొందరు ఇట నిట్లు శంకించుచున్నారు-- "నిజమే. మాలతీమాధవ మను ఈ ప్రకరణమునందు సహృదయములను ఆహ్లాదింపజేయునదే యయినను పంచమాంకమున శ్మశానాది జుగుప్సావిషయవర్ణనచేత ప్రకృత (శృంగార) రసము తిరస్కృత మగుచున్నది. కావున అంతటి గొప్ప సౌభాగ్యము లేదు--" అని. అట్లు శంకించుచున్నవారి నిట్లడుగవలెను-- "అయ్యా, పంచమాంకమునందు తగినట్టి ఆలంబనోద్దీపనసంచారిభావముల స్ఫురణచేత పోషింపబడి, రసస్థాయిని పొందిన శృంగారము హృదయగోచర మగుచున్నాదా, లేదా?" అని. "ఔను" అని వారన్నచో విరోధ మేదియు లేదని యెరుగవలెను. ఇట ఆనందవర్ధనాచార్యుల మాట పరిశీలింపుదు-

[85] "వివక్షితే రసే లబ్ధప్రతిష్ఠే తు విరోధినామ్,
బాధ్యానామంగభావం వా నీతానాముక్తి రచ్ఛలా."

[85] ధ్వన్యాలోకము. 3-20

చెప్పదలచుకొన్న రసము దృఢముగ నెలకొన్నదైనచో విరోధిరసములన బాధితము లగునట్లుగా గాని, అంగభావమును పొందునట్లుగా గాని వర్ణించుట నిర్దుష్టము. అఖండితపరాక్రము డగుటచేత శత్రువుల నాక్రమించుకొ వారి పరిపాల్యదేశమును అనుభవించుచున్న నాయకుడు పరాజితులైనవారిచే కొలువబడుచున్నా డని వర్ణించుట నాయకమహిమ నుగ్గడించును గదా. అట్లే పరిపుష్టమైన మాలత్యాలంబనమైన - పూర్వానురాగము "మమ హి' అని తొడగి-

[86] "లీనేవ ప్రతిబింబితేవ లిఖితే వోత్కీర్ణరూపేవ చ
ప్రత్యుప్తేవ చ వజ్రలేపఘటితే వాంతర్నిఖాతేవ చ,
సా న శ్చేతసి కీలితేవ విశిఖైశ్చేతోభువః పంచభి
శ్చింతాసంతతితంతుజాలనిబిడస్యూతేవ లగ్నా ప్రియా."

[ఆ నా ప్రేయసి (మాలతి) (ఇసుమున నీటిచుక్క వలె) నా చిత్తమున లయించిపోయినదా? నా యెదలో ప్రతిబింబించినదా? (అనురాగవర్ణముతో) చిత్తరువునందువలె చిత్రింపబడినదా? (శిలాదంతాదులందువలె) గండారింపబడిన రూపు గలదా? (సువర్ణాదులందు రత్నాదికమువలె) పొదుగబడినదా? వజ్రలేపముతో అతుకబడినదా? (భూమిలో నిధివలె) నిక్షిప్తమైనదా? (దారువుపై మేకులతో బిగించినట్లు) మన్మథుని పంచబాణములచేత నాచిత్తమునందు కీలింపబడినదా? లేక చింతాపరంపర లనెడు తంతుజాలముతో గట్టిగా కుట్టబడినదా? - అనునట్లుగ నా చిత్తమున హత్తుకొన్నది.]

అనునంతవరకు గల గ్రంథభాగముచేత సజాతీయములు, విజాతీయములు నగు భావాంతరములను అధఃకరింపగలుగు స్థాయిత్వమును పొందింపబడి సముద్రమువంటి ప్రధానరసముయొక్క గర్భమందు విజాతీయమైనను, విరుద్ధమైనను, మాలతిని పొందుటే ప్రధానలక్ష్యమగుటచేత దాని కంగభూతములైన బీభత్సాదిరసములను నిబంధించుట గ్రంథకర్తయొక్క నైపుణ్యమునే సూచించును. "[87] ఆత్మభావం నయత్యన్యాన్ స్థాయీవ లవణాకరః" (సముద్రము తనలో చేరిన జలములను ఏకరసముగా మార్చునట్లు

[86] మాలతీ మాధవము - 5-10

[87] దశరూపకము- 4-34

స్థాయిభావము అన్యభావములను తనలో లీనము చేసికొనును. - ముఖ్యగు శాస్త్రములనిచ్చట అనుసంధించుకొనవలెను. అట్లది ప్రతీతి గోచరమగుట లేదనినచో అట్టివారి కిచ్చట వచ్చిన నష్టమేదియు లేదు. ఏ విదగ్ధులకు అట్టి ప్రతీతి కలుగుచున్నదో వారు రసాస్వాదవివశులై ఆనందించుచునే యున్నారు. ఆ యీ సంగతినే యీ కవి ప్రస్తావనయందే "[88] భూమ్నా రసానాం గహనాః ప్రయోగాః" (అంగాంగిభావములతో ప్రచురములైన రసముల ప్రయోగములు (అభినయములు) గహనములు, సహృదయైకవేద్యములు, సామాన్యజనదుర్గ్రాహ్యములు) అని నిరూపించెను. ఇట నట్టి గహనములగు భావములు మీవంటి యవిదగ్ధులకు దుర్గ్రాహము లని భావము.

కామినీకుచకలశము వలె కించిద్గూఢమైనదానికే చమత్కారిత్వము సహృదయసమ్మతము. అసలు బీభత్సరసమే హేయమని యెచ్చటను ప్రతిపాదింపబడలేదు. "[89] శృంగార ఏవ మధురః పరః ప్రహ్లాదనో రసః" (మహానంద మొడగూర్చెడు శృంగారమే మధురమైనది.) అని ధ్వనికారుడు చెప్పియుండుటచేత ఇతరరసములకు ఆస్వాద్యత్వమే లేదని నుడువరాదు. అచ్చటనే మరల ఈ మాధుర్యగుణము (సంభోగ శృంగారమునకంటె) విప్రలంభశృంగారమునందును, అంతకంటెను కరుణరసమునందును అధిక ప్రకర్షగలదై యున్నది. "[90] శృంగారే విప్రలంభాఖ్యే కరుణే చ ప్రకర్షవత్." - అనుమాటతో స్వవచనవ్యాఘాతము కలుగును. (శృంగార మొక్కటే మధుర మగుచో కరుణరసమునకు ప్రకృష్టత్వ మెట్లు కలుగును.) మరి యిట్లైనచో ఎట్లు నిర్వాహము? ఎట్లు తెలిసికొనవలెను? అను ప్రశ్నకు ఇది మా సమాధానము - రసము లన్నియు ఆస్వాద్యములే (రసతేః స్వాదనార్థత్వా ద్రస్యంత ఇతి తే రసాః - ఆస్వాదింపబడునది రసము) అట్లు గ్రహించిననే రస మను వ్యవహారము అన్వర్థమగును. రస్యతే ఆస్వాద్యతే అను వ్యుత్పత్తి నాధారముగా గొనియే రసశబ్దము శృంగారాదిసర్వరసవిషయమునను ప్రవర్తించును. అట్లు కాదేని (రససామాన్యమునకు ఆస్వాద్యత్వము లేదనినచో) 'రస' మను వ్యవహారమే యేర్పడదు. ఈ విషయమే దశరూపకమున నిట్లు

---

88 మాలతీ మాధవము- 1-3

89 ధ్వన్యాలోకము - 2-7

90 అందే - 2-8

వివరింపబడినది-

"[91] రమ్యం జుగుప్సిత ముదార మథాఽపి నీచ
ముగ్రం ప్రసాది వికృతం గహనం చ వస్తు,
యద్వాఽప్యవస్తు కవిభావకభావ్యమానం
తన్నాస్తి యన్న రసభావ ముపైతి లోకే."

[అది మనోహరమైనదే యగుగాక - ఏవగింపు పుట్టించునదే యగుగాక, ఉదారమైననది గాని- నీచమైనది గాని, ఉగ్రమైనదిగాని - ప్రసన్నమైనది గాని, సంస్కరింపబడినది గాని, - అసంస్కృతమైనది గాని, కడకు వస్తుత్వమే (ఇది ఈ పదార్థమని గుర్తింపు) లేనిదైనను - అదెట్టిదైనను కవి - సహృదయులచే భావింపబడినదై రసతాప్రతిపత్తిని పొందలేని దేదియు ఈ లోకమున లేదు.] అని. కనుకనే రసమునందు తారతమ్యమును వాదించు పెక్కురు పండితుల వ్యవహారములన్నియు వారి వారి రుచిభేదమును బట్టియే యని ప్రతిపాదింపబడినది. ఈ విషయము 'సద్రూపకప్రశంస' యందు "రసేషు చ ప్రధానత్వం రుచిభేదనిబంధనమ్" (రసము లన్నియు ఆస్వాద్యములే అయియుండ ప్రాతిస్వికరసమునకే ప్రాధాన్యమున్నదనుట కేవలము వారి వారి యభిమతముపైననే యాధారపడియున్నది.)అనుచోట సూచింపబడినది.

అందుచేత "తస్మా దద్భుతమేవాఽ ఽ హ కృతీ నారాయణో రసమ్" (ధన్యుడైన నారాయణుడు అద్భుతమునే (ఒక్కటే) రస మనినాడు) అని అద్భుతరసమునకును, "శృంగార ఏవ" అని శృంగారరసమునకును "తదల మల్పసారైః పదైః." "శమస్తు పరిశిష్యతే శమిత చిత్తఖేదో రసః" (అల్పసారములగు పదములేల? మానసికఖేదమే లేని శమ (శాంత) రసమే ఉత్కృష్టము.) అని శమము (శాంతరసమునకును) - అని యిట్లు వారి వారి ప్రాధాన్యవాదములు స్వేచ్ఛగ ప్రవర్తిల్లగ ఏ వాదమునకు పండితులు ప్రామాణ్యము నంగీకరింపనగును? కావున తీపి మున్నగు ఆరు రుచుల విషయమునందువలె ఇచట కూడ ఆ రసముల తారతమ్యము వారి వారి యభిరుచిని బట్టియే యనుట నిశ్చయము. వాస్తవములైన న్యూనతాధిక్యములు లేవు - అని తెలియవలెను. ప్రకృతమైన ధ్వనికారుని మాటకు కూడ ఇదియే తాత్పర్యమనుటకు తగురీతిగా శ్రీమదభినవగుప్తులు వ్యాఖ్యానించినారు. ఎట్లనగా - "నను కరుణేఽ పి యది మధురిమాఽ స్తి

91 దశరూపకము 4-83

తర్హి పూర్వకారికాయాం శృంగార ఏవేతి ఏవకారః కిమర్థః? ఉచ్యతే - నానేన రసాంతరం వ్యవచ్ఛిద్యతే, అపి తు ఆత్మభూతస్య రసస్యైవ పరమార్థతో గుణాః మాధుర్యాదయః ఉపచారేణ తు శబ్దార్థయో రిత్యేవకారేణ ద్యోత్యతే." - మరి కరుణరసమందుకూడ మధురిమ యున్నచో, అప్పుడు పై బేర్కొన్న కారికయందు "శృంగార ఏవ మధురః" (శృంగారమే మధురము) అనుచోట ఏవకార మెందులకు? అను ప్రశ్న ఉదయించును. దానికి సమాధాన మిట్లు- "ఇట్లనుటచేత రసాంతరము నిషేధింపబడుట లేదు. అనగ శృంగారమే మధురమనుటచేత రసాంతరమునకు మాధుర్యము లేదనుటలో తాత్పర్యము లేదు. మరి, దాని భావమేమని యడుగగా వాస్తవముగా ఈ మాధుర్యాదులు కావ్యాత్మయైన రసమునకే సంబంధించినవి. అట్లైనను ఆ గుణములు శబ్దార్థగతములైనట్లు చెప్పుట ఔపచారికము. అన్వయరీతి యిది. ఆలోచించగా శృంగారరసమే మధురము. అట్లైనను ఉపచారముతోడ తన్మయమగు (మాధుర్యమయ మగు) కావ్యవిషయమున ఆ వ్యవహారము (శృంగారము మధురమనెడు రీతి) అని. కాబట్టియే తరువాతి కారికయందు శృంగారమందు మాధుర్యమున్నదను వాదము పునరుక్తము కాలేదని తెలియునది. ఇంతయు గాక శృంగారము కామపురుషార్థలంపటత్వమనుట సరికాదు. అట్లయిననే దాని సార్వత్రికత్వ మంగీకరింపబడును. మరి యేమి? అలౌకికములైన విభావనాచర్వణాయోగ్యమగు నాయకాద్యాలంబనమున్ననే దానికి రసత్వము. అట్లు కాదేని అనుచితవిషయక మగు ప్రవృత్తితో నేర్పడిన ఆభాసత్వ మిచట భాసించును. ఈ రసాభాస మీరీతిగ అంగీకృతము-

"[92] ఏకత్రైవాऽనురాగశ్చే త్తిర్యఙ్మ్లేచ్ఛగతోऽపి వా,
యోషితో బహుసక్తిశ్చే ద్రసాభాసః......" అని.

[అనురాగము నాయికానాయకులలో ఒక్కరియందు మాత్రమే ఉన్నను, తిర్యగ్జంతుగతమైనను, మ్లేచ్ఛగతమైనను (పశుప్రాయులు అనాగరికులు మ్లేచ్ఛులు) ఒక యువతికి బహుపురుషగతమైనను అది రసాభాస మగును.]

అందువలన దీనికి గూడ భావకులకు మాత్రమే, ఆస్వాద్యత్వ మితరరసములకు వలెనే యని చెప్పదగును. ఇట్లనుటచేత శృంగార ప్రకాశకారాదుల వచనముల నుదాహరించి శృంగారప్రాధాన్యసాధనము గూడ

---

[92] ప్రతాపరుద్రీయము - రసప్రకరణము 10

విమర్శింపబడినట్లే.

వచనౌచిత్యము పాటించుటకూడ ఆ యా రసముల నిరూపణలంద కవి కున్న తన్మయతను ఆవిష్కరించుచున్నది. ఎట్లనగా- [93] "జ్వలతి గగనే రాత్రౌ రాత్రావఖండకల శ్శశీ (ప్రతిరాత్రియందు సకలకలాపరిపూర్ణ డగు చంద్రుడు ఆకాశమున జ్వలించుగాక) ఇత్యాదిస్థలములందు ఇది స్ఫుటము. ఇచ్చట మన్మథవ్యథ ననుభవించు మాలతియొక్క మాటలలో శృంగారానుగుణమగు ప్రసన్నమధురమైన కూర్పే యున్నది. ఇట శృంగార రసప్రతీతికి ప్రతికూలమగు విరోధివర్ణముల సంగ్రహణ లవలేశమైనను లేదు. శృంగారవిరోధివర్ణములను ధ్వనికారుడు-

"[94] శషౌ సరేఫసంయోగో ఢకారశ్చాపి భూయసా,
విరోధిన స్స్యుః శృంగారే తేన వర్ణా రసచ్యుతః" అని నిరూపించినాడు.

[శ-ష లు ద్వివిధరేఫసంయోగములు (ర్క, క్ర వంటివి.) పలుమారులు ఢకారమును ప్రయోగించుటయు శృంగారమునకు ప్రతికూలములు. అందుచేత ఆ వర్ణములు రసమును స్రవింపవు. రసమునుండి భ్రష్టము లగును. అనగా రసవ్యంజకములు కావు.]

మరల ఆచోటనే బీభత్సాదిరసముల విషయమున కాంతిమంతమైన, ఓజస్వియైన, వికటమైన పదబంధ ముండవలెను. అది యిట్లు-

"[95] ఉత్కృత్యోత్కృత్య కృత్తిం ప్రథమమథ పృథూత్సేధభూయాంసి మాంసా
న్యంసస్ఫిక్పృష్ఠపీఠాద్యవయవసులభా న్యుగ్రపూతాని జగ్ధ్వా"-.......

[మొదట చర్మమును కోసి కోసి శరీరపు ఎత్తైన (బలిసిన) ప్రదేశములందు అధికములైన భుజశిరస్సులందును, కట్యధోభాగములందును, పృష్ఠపీఠములందును సులభములగు మాంసములను మెసవి]

మున్నగు స్థలములందు చూడనగును. ఇచ్చట శృంగారవిరోధియైన బంధగాఢత్వముచేతనే వర్ణనీయకావ్యవస్తువు ఎదుట ప్రత్యక్షమైనట్లు స్ఫురించుచున్నది.

---

[93] మాలతీ మాధవము 2-2

[94] ధ్వన్యాలోకము 3-3

[95] మాలతీమాధవము 5-16

ఈ విషయమునే ధ్వనికారుడు-

"[96] త ఏవ తు నివేశ్యంతే బీభత్సాదౌ రసే యదా,
తదా తం దీపయంత్యేవ తేన వర్ణా రసచ్యుతః" అని నిరూపించినాడు.

[పై చెప్పిన పరుషవర్ణములు బీభత్సాదిరసములం విషయమున కూర్చబడినచో అప్పు డవి ఆ రసమును తప్పక ప్రకాశింపజేయును. కావున వర్ణములు రసస్యందు లగుచున్నవి].

ఆ తీరుననే అలంకారనివేశముగూడ రసానుగుణముగనే యున్నది. "లీనేవ ప్రతిబింబితేవ లిఖితే వోత్కీర్ణరూపేవ చ" ఇత్యాదిస్థలములందు ఉత్ప్రేక్షాలంకారములయొక్క సన్నివేశముగూడ రసానుగుణముగనే యున్నది. అట్లే-

"[97] రాహోశ్చంద్రకలా మివాననచరీం దైవాత్సమాసాద్య మే
దస్యోరస్య కృపాణపాతవిషయా దాచ్ఛిందతః ప్రేయసీమ్"

[రాహువు వాతబడిన చంద్రకళవంటి (నిన్ను, మాలతిని) దైవవశమున పొంది చోరుడగు ఈ యఘోరఘంటుని ఖడ్గపాతమునకు లక్ష్యమై యున్నదానిని నా ప్రేయసిని బలిమిమై నాచికొనిన నాదు చిత్తము]

మొదలైన స్థలములందు 'రాహో రాననచరీం చంద్రకలామివ' (రాహువు వాతబడిన చంద్రకళ వంటి) అనెడు ఉపమాలంకారముచేత వ్యంజితమగు విషమాలంకారము కరుణరసమును కందళితము చేయుచున్నది. దీనినే ధ్వనికారు డిట్లు ప్రశంసించుచున్నాడు-

"[98] రసభావాదితాత్పర్య మాశ్రిత్య వినివేశనమ్,
అలంకృతీనాం సర్వాసామలంకారత్వసాధనమ్.
ధ్వన్యాత్మభూతే శృంగారే సమీక్ష్య వినివేశితః,
రూపకాదిరలంకారవర్గో యాతి యథార్థతామ్ (2-17)

[అలంకారముల నిర్వాహము రసభావాదులకు అనుగుణముగా (పోషకముగా) చేయవలెను. అప్పుడే అన్ని యలంకారములకును అలంకారత్వము

---

96 ధ్వన్యాలోకము 3-4

97 మాలతీమాధవము. 5-28

98 ధ్వన్యాలోకము 2-17

(శోభాకరత్వము) సిద్ధించును. ధ్వన్యాత్మక మగు శృంగారరసవిషయము చక్కగా సమీక్ష చేసి సూక్ష్మదృష్టితో కూర్పబడిన రూపకాద్యలంకారవర్గము అన్వర్థ మగును.]

అట్టి సమీక్షను ధ్వన్యాలోకకారుడే ఈ క్రింది విధముగ నిరూపించినాడు-

[99] వివక్షాతత్పరత్వేన నాంగిత్వేన కదాచన,
కాలే చ గ్రహణత్యాగౌ నాతినిర్వహణైషితా,
నిర్వ్యూఢావపి చాంగత్వే యత్నేన ప్రత్యవేక్షణమ్,
రూపకాదే రలంకారవర్గ స్యాంగత్వసాధనమ్." (2-18, 19)

[రసబంధతత్పరుడగు కవి రసప్రవణమగునట్లుగనే, తదంగముగనే అలంకారములను నిబంధింపవలెనే గాని అంగియగునట్లు (ప్రధాన మగునట్లు) చెప్పదలపరాదు. అట్లే అలంకారములను అంగములుగా వివక్షించుచు అవసరమును బట్టియే గ్రహింపవలెను. అట్లు గ్రహించినను రసానుగుణమగు వేరొక అలంకారముకొరకై ఆవశ్యకత ననుసరించి దానిని విడువవలెను. అలంకారమును అధికముగా (అతిపుష్టముగా) నిర్వహింప దలపరాదు. నిర్వహింపదలచినను మిక్కిలి మెలకువతో దానికి అంగత్వమే సాధింప ప్రయత్నింపవలెను. పైచెప్పిన రీతియే రూపకాద్యలంకారములకు అంగత్వసాధకోపాయము.]

అది యెట్లనగా-

"[100] శ్లథయతి వచనం తే స్రంసయత్యంగమంగం
జనయతి ముఖచంద్రోద్భాసిన స్స్వేదబిందూన్,
ముకులయతి చ నేత్రే సర్వదా సుభ్రు, ఖేద
స్త్వయి విలసతి తుల్యం వల్లభాలోకనేన."

[పూలు కోయుటవలన ఏర్పడిన శ్రమ నీ మాటలను తొట్రిం జేయుచున్నది; ప్రత్యవయవమును దుర్బల మొనర్చుచున్నది; చంద్రుని బోలు నీ మోమునందు ప్రకాశించెడి స్వేదబిందువులు పుట్టించుచున్నది; నీ కన్నులను ముకుళింపజేయుచున్నది; చక్కని కనుబొమ్మలు గల ఓ మాలతీ,

---

[99] ధ్వన్యాలోకము 3-18,19

[100] మాలతీమాధవము 3-8

ఇది యంతయు వల్లభసందర్శనముతో నేర్పడినవానితో సమానముగ ఈ భేదము నీయందు విలసిల్లుచున్నది. 'వల్లభాలోకనేన తుల్యం' అనునపుడు తుల్యశబ్దము సహార్థకము కావున ప్రియదర్శనము తోడనే అని యర్థము. అప్పుడు ప్రియదర్శనము వెనువెంట ఈ సాత్త్వికభావము లుదయించినవని హృద్గతాభిప్రాయము.]

ఇచట పుష్పాపచయ శ్రమజనిత స్వేదబిందూత్కరాయాసిత యగు మాలతిని పరిహసించునప్పుడు గ్రహించిన సహోక్త్యలంకారము మాధవా లోకనమును సూచించునదై కృతకృత్యమగుచున్నది. ఇట్లే "ఇయమవయవైః పాండుక్షామైః" ఇత్యాదిసందర్భములందు (రసానుగుణాలంకారసన్నివేశమును) పరిశీలింపవలయును. ఇట కొందరు-

"[101] జగతి జయిన స్తే తే భావా నవేందుకలాదయః
ప్రకృతిమధురా స్సంత్యేవాన్యే మనో మదయంతి యే,
మమ తు యదియం యాతా లోకే విలోచనచంద్రికా
నయనవిషయం జన్మన్యేక స్స ఏవ మహోత్సవః".

[మాధవుడు మకరందుని కోర్కెమేరకు మాలతిచిత్రమును వ్రాసి దానిక్రింద శ్లోకమును వ్రాసినాడు. దానిని మకరందుడు చదువుచున్నాడు. - 'నిసర్గమధురములై మనసును ఉల్లాసపరచునట్టివై జయశీలములైన (విరహిజన వశీకరణసమర్థములైన) నవేందుకల మున్నగు పదార్థము లెన్నో ఈ జగమున గలవు. (వానితో నాకు పనిలేదు) మరి నాకు మాత్రము నా కన్నుల వెన్నెలయైన ఈ ప్రియమాలతి కన్నుల మ్రోల ప్రత్యక్షమగు టొక్కటే ఈ లోకమున ఈ జన్మమందు మిక్కుటపు నానంద మందించెడు పెద్ద పండువు.]

అనుచోట స్వరచనవ్యాఘాతము (స్వోక్తివిరోధము) శంకించుచున్నారు. "నవేం దుకలాదులు మాలతిని చూచిన మాధవుని కండ్లకు అసారము లగుటచేత కొరగానివి. అట్టి మాధవుడే మరల మాలతియందు ఉత్కర్షను తెలుపుటకై (కన్నుల వెన్నెల యని) చంద్రికాతాదాత్మ్యారోపము చేయుట వ్యాఘాతము కాదా"? వారి శంకకు సమాధానము- ఇతరులకు మానసికానందము నొడగూర్చు; నవేందుకలాదులు - ఉన్నచో ఉండనిండు. వానితో ప్రయోజన మేమి? - అనుచు తన విషయమున సాధారణజనులకంటె వ్యతిరేకమును

---

[101] మాలతీమాధవము 1-39

(భేదమును) 'మమ తు' (మరి, నాకన్ననో) అని తెలుపుకొన్నాడు. 'ఆమె నా నయనములకు చంద్రిక' అనగ చంద్రికవలె ఆనందదాయిని యనుట ఔపచారికము. వస్తుగత్యా ఆమెయే చంద్రిక. ఈ మాలతి ఈ జన్మలో నా కన్నులకు కనిపించుటే సదృశోత్సవాంతరరహితమైన మహోత్సవము. ఉపచార మనగ లక్షణావృత్తియే. మాలతివిషయమున చంద్రికాశబ్దమును లక్షణావృత్తిచేతనే (అగ్ని ర్మాణవకః ఇత్యాది స్థలములందు వలె) ప్రయోగింపవలసి వచ్చినందున లక్షణాకల్పనాప్రయుక్తదోషము కాదా యని శంకింపవలదు. కవిలోకమునకు ఔపచారికశబ్దప్రయోగము సమ్మతమే. ఈ ప్రయోగములు గమనింపుడు-

"[102] నియతైకపతివ్రతాని పశ్చాత్తరుమూలాని గృహీభవంతి తేషామ్." [నియమవతి యగు] ఒక ధర్మపత్నియే గలట్టి తరుమూలములే గృహము లగు చున్నవి.] అని మహాకవి కాళిదాసు,

"[103] ఆలోకా హృదయాలవో రసవశా దీశాన మీషత్స్మితం
ప్రచ్ఛాయాని వచాంసి పద్మనిలయాచేతశ్శరవ్యం వపుః,
చక్షుష్మంతి గతాగతాని తదిమే శ్రీరంగశృంగార తే
భావా యౌవనగంధినః కిమపరం సించంతి చేతాంసి నః."
[శ్రీరంగరాజస్తవము - పూర్వశతకము - 72]

[శృంగారరసస్వరూపా, శ్రీరంగనాథా, నీ క్రీగంటిచూపులు సహృదయములు. (దయాపూర్ణములు) నీ చిరునగవు ప్రేమపారవశ్యమున ఈశ్వరరూపము (లోకమును అదుపులో నుంచుకొన్నది.) నీ పలుకులు దట్టమైన నీడ గలవి. (సంసార కాంతార సంచార ఖిన్నులకు విశ్రాంతి నిచ్చునవి.) నీ సుందరదేహము పద్మాలయాచిత్తమే లక్ష్యముగా గలది (వశీకరణసమర్థ మనుట.) నీ యాత్రాకాలపు గతాగతములు చక్షుష్మంతములు. (చూపరుల కన్నుల నాకట్టుకొనగలవి.) చెప్పవలసిన దేమున్నది. పై జెప్పిన పదార్థము లన్నియు యౌవనగంధముగలవై (తారుణ్యసూచకములై మా చిత్తములను తడుపుచున్నవి. చల్లదనము (ప్రసన్నత)నిచ్చుచున్నవి. పై శ్లోకమందు 'హృదయాలవః' వంటి పెక్కుపదములు (బ్రాకెట్లలో

---

[102] శాకుంతలము 7-20

[103] శ్రీరంగరాజస్తవము 1-72

చూపిన తీరున) లక్ష్యార్థబోధకములు]

అని పరాశరభట్టార్యులు - మున్నగువారి పరశ్శతప్రయోగములు పర్యాలోచింపవలెను.

> "[104] తదేతత్కావ్యసర్వస్వం సమాధిర్నామ యో గుణః,
> కవిసార్థస్సమగ్రోఽపి తమేన మనుజీవతి".

[సమాధి యను ఈ గుణమే కావ్యసర్వస్వము. సమగ్రకవిసముదాయము దీని ననుసరించి జీవించుచున్నది.]

అనుచు దండ్యాచార్యుడు లక్షణామూలకమైన సమాధిగుణమును కావ్యగుణములందు ముఖ్యమైనదని ఉపదేశించుచున్నాడు. ఇతరులకు వేరైన దేదో చంద్రిక నాకు మాత్ర మీబడే అనెడు తాత్పర్యవివక్షనుగాని ఊహించుచో పై దోషమునకు అవకాశమే లేదు. అట్లే విషయాంతరము లూహింపదగును.

ఈ కవి రచితమే అయిన మహావీరచరిత మను రూపకము భగవద్రామచంద్రుని పూర్వచరిత్రవర్ణనపరమైనది. వీరరసప్రధానమగు ఆ ప్రబంధమున దానికి తగినట్టిదే ఆ పదబంధము. అందునను భగవంతునియందలి ధీరోదాత్త ప్రకృతిప్రతిపత్తి, మహానుభావత్వము, మహాబలాఢ్యత్వము మున్నగు నెన్నో గుణములు రసికజనాస్వాద్యము లగునట్లు వర్ణింపబడినవి. అవి రసాంగములై రసోత్కర్షహేతువు లైనవి. అందు కవికి భగవంతునెడ గల భక్తిభావము ప్రకాశించుచున్నది. రామాశ్రయమయిన ఆ కథ-

> "[105] తేనేద ముద్ధృతజగత్త్రియమన్యుమూల-
> మస్తోకవీరగురుసాహస మద్భుతం చ,
> వీరాద్భుతప్రియతయా రఘునందనస్య
> ధర్మద్రుహాం (హో) దమయితు శ్చరితం నిబద్ధమ్".

[ఆ భవభూతిచేత శౌర్యగుణము గలదై, ఆశ్చర్యకరమై సకలజనప్రియమైన దగుటచేత పెకలించివేయబడిన ముల్లోకముల దుఃఖమూలము గలదియు, విపులవీరరసము గలదియు, అధికసాహసకర్మలు గలదియు,

---

[104] కావ్యాదర్శము 1-100

[105] మహావీరచరితము 1-6,

అద్భుతమైనదియు నై ధర్మద్రోహుల నణచునట్టి రఘునందనచరితము నిబంధింపబడినది.]

"[106] ధను రనుజసహాయం రామదేవం నినాయ" [ఆ విశ్వామిత్రుడు చాపసోదరసహాయుడగు శ్రీరామచంద్రుని అడవికి చేర్చెను.] మొదలైన స్థలములందు కంఠోక్తిగానే ప్రతిపాదించెను.

ఈ కవికావ్యములందు ఇదియే మొదటికావ్య మని పలువురు పలుకుచున్నారు. ఇతరులు మాలతీమాధవమే మొదటిదని అభిప్రాయపడుచున్నారు. రామచరితాత్మకములగు నాటకములలో ఇది మొదటి దను నంశము సర్వాంగీకృతము. కథాక్రమ మట్టిది కావున అందు వివాదము లేదు. ఉపోద్ఘాతము కూడ ఈ విషయమును సూచించుచున్నది. పూర్వమే కవి రామకథను ప్రతిపాదించియుండినచో తాను క్రొత్తవాడైనట్లుగా "[107] ప్రాచేతసో మునివృషా ప్రథమః కవీనాం యత్పావనం రఘుపతేః ప్రణినాయ వృత్తమ్, "భక్తస్య తత్ర సమరంసత మేఽపి వాచః" [ఆదికవియు వరుణపుత్రుడును అగు ఋషిపుంగవుడు పావనమగు రఘుపతిచరిత్రమును కావ్యరూపమున నిర్మించెను. అట్టి రామచరిత్రమందు భక్తుడనైన నా మాటలుగూడ సంగతములైనవి] అని గ్రంథప్రతిజ్ఞ చేయదు గదా. ఉత్తరరామచరిత్రయందు ఇట్టి ఉపోద్ఘాతము లేకపోవుట కూడ (మహావీరచరితము మొదటి గ్రంథ మనెడు) పై ఊహకు ఉపోద్బలకము.

ఈ ప్రబంధమున కవి వైదేహీరఘురాముల పరస్పరానురాగము అన్యోన్యదర్శనపూర్వకమగుటచేత, ఇతరవృత్తాంతానుగుణ్యముకొరకై యాగము చేయుచున్న విశ్వామిత్రునియొక్క ఆశ్రమమునకు సీత, ఊర్మిళలతో బాటు కుశధ్వజుని రాకను, అప్పుడే రావణపురోహితుడగు సర్వమాయుడు సీతను ప్రార్థించుటకై వచ్చుట, అప్పుడే శంకరధనుర్భంగము మొదలైనవన్నియు కల్పింపబడినవి. ఇదియే గాక ధీరోదాత్తప్రకృతికి అనౌచిత్య మేర్పడకుండ దానిని పరిహరింప కపటోపాయముతో వాలివధ జరిగినట్లు చెప్పక దానికి బదులుగా మాల్యవంతునిచేత ప్రేరితుడైన వాలి రామచంద్రునిపై ఆక్రమణ జరిపినట్లు వర్ణింపబడినది. ఇంతమాత్రపు కథమార్పిడిచేత ఇది మిశ్రేతి

---

[106] అందే 1-8

[107] అందే 1-7

వృత్తము గల దనెడువారు సాధువిమర్శకులు కారని నిరూపించెదము.

"[108] యత్ర్రతానుచితం కించిన్నాయకస్య రసస్య వా,
విరుద్ధం తత్పరిత్యాజ్య మన్యథా వా ప్రకల్పయేత్".

[ఇందు (ఇతివృత్తమున) నాయకునకు అనుచితమగు అంశమేదైన నున్నచో, రసమునకు విరుద్ధముగ నేదేని యున్నచో దానిని వదలివేయుట కర్తవ్యము. లేదా, ఉచితమగునట్లును, విరోధము లేకుండునట్లును మార్పు చేయవలెను.]

అని లాక్షణికుల సమ్మతి యుండుటచేత శాకుంతలాదులందుగూడ (ఇట్టి దృష్టితోడనే) దుర్వాసశ్శాపాదివృత్తాంతముల కల్పించుట కన్పడుచుండుట చేత అంతటితో శాకుంతలమునకు నాటకవ్యవహారభంగము లేకుండుటచేత, ఆ ప్రబంధము ఖ్యాతేతివృత్తమే యని 'నాటకం ఖ్యాతవృత్తం స్యాత్' - మున్నగు సందర్భములందు ప్రతిపాదించుటవలనను, ప్రసిద్ధనాయక విషయమందు ఇతివృత్తమును పూర్ణముగ కల్పించిననే అట మిశ్రవృత్తత్వ మంగీకరింపబడినది గాన మహావీరచరితమునకు నాటకత్వభంగము వాటిల్లదు.

ఈ నాటకమందలి శ్లోకములు తరచు వీరరసమును చిప్పిలజేయునవై యుండుటచేత సహృదయహృదయముల నాకట్టుకొనునవిగా కన్పట్టుచున్నవి. అందు కొన్నిటిని స్మరింతము.

" [109] కన్యారత్న మయోనిజన్మ భవతా మాస్తే, వయం చార్థినో
రత్నం చేత్క్వచిదస్తి తత్పరిణమత్యస్మాసు శక్రాదపి,
కన్యాయాశ్చ పరార్థతైవ హి మతా తస్యాః ప్రదానా దహం
బంధుర్వో భవితా పులస్త్యపులహప్రష్ఠాశ్చ సంబంధినః".

[మీవద్ద అయోనిజ యైన కన్యారత్న మున్నది. మేమో అర్థించువారము. రత్న మెచ్చట నున్నను 'రత్నహారీ తు పార్థివః' అన్న న్యాయము చొప్పున, ఇంద్రు నుజ్జగించి, ఆతని జయించిన మాయందే నించి మాకే చెందవలెను. 'అర్థో హి కన్యా పరకీయ ఏవ' కన్యక పరులసొమ్మే యని సర్వసమ్మతము. ఆమెను మాకు నిచ్చినచో మేము మీకు బంధువుల (అల్లుడుగా) మయ్యెదము. పులస్త్యపులహాదులు వియ్యమంది చుట్టా లగుదురు.]

---

[108] దశరూపకము 3-24

[109] మహావీరచరితము - 1-30

నమస్కారము.]

పరశురాము నెదుర్కొనుచున్న రామభద్రుడు పెద్దల నుద్దేశించి ప్రార్థనగా పలికిన పలుకు లివి. ఇచ్చట సంపూర్ణబలసంపన్నుడగు ప్రతినాయకుని మహిమను వర్ణించుటచేత ఉద్దీపితమై తద్గుణవర్ణనాత్మక వాక్యారంభరూపమగు అనుభావముచేత, విల్లు వంచుట మున్నగు శరీర వ్యాపారరూపములగు అనుభావములచేతను హర్ష-అమర్ష-ఔత్సుక్యాదులగు సంచారిభావములచేతను పోషింపబడిన సముగ్రోత్సాహస్థాయిభావాత్మకమైన వీరరసము చర్వణాగోచరమయి బలాత్కారముగనైనను సహృదయులను ఉత్సాహయుక్తుల జేయుచున్నది.

ఆలాగుననే యిట కొన్ని నాయకగుణములు ప్రతీతిగోచరములగుచు న్నవి. "[112] తాని తాని జగతీక్షేమాయ రామాత్మనో దైత్యారేః" (రామరూపి యగు విష్ణుమూర్తియొక్క ఆ యా యుదారచరిత్రలు లోకక్షేమార్థము) అని మహామహిమత్వము, "[113] ఉత్పత్తి ర్దేవయజనాత్" (యజ్ఞక్షేత్రమునుండి ఆవిర్భవించుట) మున్నగు వచనములచేత ఆజానపావనత్వాది నిరూప ణపూర్వకముగ జానకీదేవియందు రామచంద్రునకు అనురాగోదయమును వర్ణించుటచేత గుణతారతమ్యజ్ఞాతృత్వము,"[114] సాధారణ్యాన్నిరాతంకః కన్యా మన్యోఽపి యాచతే" (అందరికి సాధారణ మగుటచేత కన్యను ఇతరు డెవ్వడైనను నిర్భయముగా యాచింపవచ్చును) అనునది మొదలు "నిర్విఘ్నప్రతిపన్నవిశ్వవిజయో వీరస్తు క స్తాదృశః" (నిర్విఘ్నసంపాదిత ప్రపం చవిజయుడైన వీరుడగు రావణుని వంటి శూరుడెవ్వడు?) అనునంతవరకు గల వచనములచేత భగవద్రామునకు శత్రువునందుగూడ గుణగణముల గ్రహించుటయందు గల కుతూహలము మున్నగు గుణములు అట నట ప్రతిపాదింపబడినవి. అట్లే పరశురామునియందు ధీరోద్ధతత్వము వ్యక్తీకరింపబడినది. "అపి ప్రభోర్వః కుశలం తస్య మాతామహేన ప్రతిషి ధ్యమానస్వయంగ్రహాత్" (అట్టి మీ ప్రభువునకు (రావణునకు )కుశలమేనా? (దశముఖుడు) మాతామహునిచేత (మాల్యవంతునిచేత) నివారింపబడినవాడై,

[112] అందే

[113] అందే 1-21

[114] మహావీరచరితము 1-31

చెప్పిన యుపన్యాసము మహాకవి మహర్షికల్పు డని బోధించుచున్నది. అట్లు కానివాడు అట్టి యుదాత్తవిషయము నెట్లు ప్రతిపాదింపగండు?

వేరగు ఘట్టములందును ఆ యా పాత్ర్యాంశములందు ఆ యా సందర్భములలో దాని దానికి తగినట్లు కూర్చుట నాటకకర్తయొక్క లోకవిజ్ఞానవైశిష్ట్యమును తేటతెల్లము చేయుచున్నది. ఇట్టి, సర్వవిధప్రశంసా పాత్రమై వీరరసప్రధానమగు వేరొక ప్రబంధమును మరెచ్చటను కానరాదు. "వీరరసప్రధానమైన వేణీసంహార మను నాటక మొక్కటి అట్టిది యున్నది కావున ఇట్లనుట యుక్తము కాదు" అని పలుకుట యనుచితము. అందు రసస్ఫూర్తివిరోధులగు పలుదోషములు "[116] ఖలేకపోతన్యాయముగా' ఒక్కుమ్మడిగా పైన బడి, కొన్నియెడల ఎట్లెట్లో సహృదయాస్వాదయోగ్యముగా జేయబడిన రసమును గూడ జాగృతము చేయ నసమర్థములై, అంతమాత్రమే కాక, దానిని తిరస్కరించుచు ప్రభువును నీచభృత్యుల వలె చెరచుచున్నవి. అది యెట్లన-

"[117] ఉత్తిష్ఠంత్యా రతాంతే భరమురగపతౌ పాణినైకేన కృత్వా" [సురతావసానమున ఒక కరముతో తన భారమంతయు నాగరాజుపై నుంచి లేచుచున్నట్టి (లక్ష్మి)] అని యారంభమగు (సంభోగశృంగారప్రధానమగు) శ్లోకమును వీరరసప్రధానప్రబంధమగు) నాందిగా నుంచుట అంతగా ఉచితము కాదు. ఇది గాక, ఇట తల్లిదండ్రివంటివారగు లక్ష్మీనారాయణుల సాక్షాత్సంభోగవర్ణన చేయబూనుట ఔచిత్యమును పోషింపదు. "[118] తథాభూతాం దృష్ట్వా నృపసదసి పాంచాలతనయామ్" [రాజసభలో అటులైనట్టి పాంచాలరాజతనయను జూచి] మున్నగు నెడల న్యూనపదత్వాదిదోషములను

116 "వృద్ధా యువానః శిశవః కపోతాః ఖలే యథాఽమీ యుగపత్పతంతి" అనినట్లుగ ముదుసలులైన పడుచులైన పిల్లలైన పావురములన్నియు (ఆహారముకొరకై) కళ్లముపై ఒక్కుమ్మడిగ వ్రాలును. దీనినే 'ఖలేకపోతన్యాయ' మందురు. ఏకకార్యసాధనపై అన్నియు (కారణము) ఏకకాలమున వచ్చిపడుటను సూచించుటకై ఈ న్యాయము ప్రయోగింతురు.

117 ఇది వేణీసంహారమున కవిపింపలేదు.

118 అందే 1-13

[119] ఆలంకారికులే చాటి చెప్పినారు. స్వప్నదృష్టవృత్తాంతమును వర్ణించుచున్న భానుమతి మాటలను సుయోధనుడు వేరుతీరుగ సంభావించుట బాగు కాదు. క్రోధాంధుడగు అశ్వత్థామ పరాధిక్షేపము చేసినట్లు వర్ణింపవచ్చునేగాని పామరజనులు కూడ చేయకూడని విధముగ యజ్ఞోపవీతములు త్రెంపబూనుట వర్ణింపరాదు. ఇట్లు వర్ణించుటవలన కవి పరిహాసపాత్ర మగును. నాటకపాత్రలు కూడ అపహాసము పొలగుట సంభవించి - విరసత్వ మేర్పడును. ఈ విషయమునే ప్రాచీనులు-

"[120] అనౌచిత్యాదృతే నాఽన్యద్రసభంగస్య కారణమ్,
ప్రసిద్ధౌచిత్యబంధస్తు రస స్యోపనిష త్పరా".

[ఔచిత్యభంగమున కంటె రసభంగహేతువు వేరొక్కటి లేదు. సర్వజనానుమోదార్హమగు ఔచిత్యమును నిర్వహించుటే రసపుష్టికి జీవామృతము.] అని యుపదేశించిరి. ఈ విషయమే "అనౌచిత్యం తు రసభంగహేతుత్వాత్పరిహరణీయమ్"- అనౌచిత్యమువలన రసభంగమగును కావున దానిని దూరముగ నుంచవలెను.] అని తొడగి విస్తృతగ్రంథభాగమున నిరూపింపబడినది.

[121] కృత మనుమతం దృష్టం వా యైరిదం గురుపాతకం
మనుజపశుభి ర్నిర్మర్యాదై ర్భవద్భి రుదాయుధైః,
నరకరిపుణా సార్ధం తేషాం సభీమకిరీటినా
మయమహ మసృఙ్మేదోమాంసైః కరోమి దిశాం బలిమ్."

[గురుద్రోహరూపమైన ద్రోణవధ యను మహాపాతకమును చేసినవారెవ్వరో, చేయించినవారెవ్వరో, అనుమతించినవా రెవ్వరో, అధర్మమును నివారింపకచూచుచుండినవా రెవ్వరో మానుషదేహమును ధరించిన పశువులై ధర్మమార్గము మీరినవారై ఉద్యతాస్త్రులై యున్నట్టి మిమ్ముల నందరిని కృష్ణ భీమార్జునులతో బాటుగ నేనొక్కడనే వధించి వారి రుధిరవసా పిశితములతోడ దిక్కులకు బలి వెట్టెదను.]

---

[119] చూ. కావ్యప్రకాశ.

[120] ధ్వన్యాలోక వృత్తి గ్రంథము-3-14-కారికకు పిమ్మట

[121] వేణీసంహారము- 3-24

అతిమాత్రవికటబంధార్థములగు ఉద్దీపితక్రోధుడైన వీరునియొక్క పెక్కు మాటలందు, దీర్ఘాక్షరప్రచురములైన కాఠిన్యశూన్యములైన ఓజోగుణరహితములైన పద్యముల రచన కవియొక్క పొరపాటునే ప్రకటీకరించుచున్నది. అందునను "అస్పృజ్మేదోమాంసైః" అత్యంతసౌకుమార్యావహములగు '(జ్మే' వంటి) వర్గాంత సంయోగము గల పద్యరచన మిగుల ననుచితము. అందుచేత, విషయమందు నిష్ఠురమై, బంధమున కోమలమైన వీరాటోపమును బోధింపలేని దగు ఈ వాక్యము కోపాక్రాంతయైన యబలయొక్క శపథవచనములతో (తిట్లతో) సమానజాతిదిగా అనుభవమునకు వచ్చుచున్నది.

అట్లే- భీకరసంగ్రామమున అనేకవీరనాశము అధికాధికముగ నుండగ సుయోధనుడు భానుమతితోడ తన సంభోగేచ్ఛను వెలువరించుటలో కవి యుద్దేశము దుర్యోధనుడు అవిమృశ్యకారి యని తెలియజేయుటయే కాని యాదికవియొక్క అవిమృశ్యకారిత్వమునే ప్రకటించుచున్నది. ఇంతయేగాక చివరకు బహూపాయములచేత, శ్రీకృష్ణభగవానుని సహాయముచేతను, భీమార్జునుల బలసంపత్తిచేతను దుర్జయులగు భీష్మద్రోణప్రముఖులను జయించి దుర్లభ యగు జయలక్ష్మిని చేకొని శుభరాజ్యాభిషేకమును పొంద నుత్సాహితుడై యున్న యుధిష్ఠిరుని విషయమున కల్పితభీమసేనమృతి వినుట, దానివలన వాపోవుట, మరణింప నిశ్చయించుకొనుట, సందేశమంపుట, అసంగతప్రలాపము, చితి రగుల్కొల్పుట మున్నగు విషయములు విస్మయజననోద్దేశముతోడనైనను విపులముగ వర్ణింపబడినవై మిక్కుట మగు అమంగళస్ఫూర్తిని, విరసత్వమును విస్తరింపజేయుచున్నవి. ఇట్లు మరల మరల పై పై వచ్చి పడుచున్నట్టి మిగుల ననౌచిత్యకారణము లగుచున్న ఇట్టి పెక్కు విషయములచేత అడుగడుగున రసభంగదూషితమైన ఈ రూపకము సహృదయులకు ఇసుమంతైన రసాస్వాదము కలిగింప నసమర్థము.

ఇట్టి వైరస్యహేతువులగు నంశములను తొలగించి సహృదయ హృదయములందు ఆనందామృతమును చిలికించెడు అలంకారములు, గుణములు, సందర్భము, రచన తదితరములగు విశేషముల నన్నిటిని పరిపరివిధముల తన గ్రంథములందు రసప్రతీత్యనుకూలముగ కూర్చుటచేతనే ఈ భవభూతి మహాకవి యైనాడు. ఈ విషయమునే ధ్వన్యాచార్యుడు - "[122] ఏతావతి కవిపరంపరావాహిని సంసారే కాలిదాసాదయో ద్విత్రాః పంచషా

[122] ధ్వన్యాలోకము

వా మహాకవయ ఇతి గణ్యంతే" [ఇంతగా కవిపరంపరాప్రవాహాయుక్తమగు ఈ లోకమున కాలిదాసప్రభృతులగు ఇద్దరో-ముగ్గులో, ఐదారుగురో మహాకవులని గణుతి కెక్కినారు.] అని వివరించినాడు.

"కాళిదాసాదిరచిత గ్రంథములందును కొన్ని లక్ష్యములందు రసప్రతీతి విరోధులగు కొన్ని యంశములు కన్పించినను అవి తదీయప్రతిభాప్రవాహమునందు మునిగిపోయి అంతగా అనౌచిత్యమును స్ఫురింపనీయవు" అనియు ధ్వన్యాలోకమున నిరూపింపబడినది. అట్టిదే వీరచరితమునందును ఒక ఘట్టమున్నది. రామచంద్ర-భార్గవరాముల సమరోత్సాహాతిశయము కాష్ఠాప్రాప్తము కాగా "దేవ్యః కంకణమోక్షణాయ మిలితాః రాజన్ వరః ప్రేష్యతామ్" (దేవేరులు కంకణమోచనమునకై చేరియున్నారు. ఓ రాజా, వరుని పంపుము) అనుచోట వీరరసమునకు అస్థానవిచ్ఛేదము. ఇచ్చట కవి యనవధానమే దానికి హేతువని యూహించుచున్నాము. ఈ గ్రంథములోనే చివర పాత్ర్యప్రబంధమునందువలె నొక్కచో కథాంశమును అనువాదరూపముగా కూర్చుటయు అంతగా బాగులేదనియు కొందరనుచున్నారు. వధయుద్ధములను అభినయమూలమున ప్రదర్శింపరాదు అనుటను "[123] దూరాహ్వానం వధం యుద్ధమ్" అని యారంభించి, 'అంబరగ్రహణాదీని ప్రత్యక్షాణి న నిర్దిశేత్' అనెడి నిషేధవచనములచే తెలిసియుండియు ఈ నియమమును మీరినట్టి కాళిదాసుయొక్క "[124] క్షామం కేనచి దిందుపాండు తరుణా" అని యారంభమై "శకుంతలా నాట్యేన పరిధత్తే" అనునంతవరకు గల సందర్భమునందలి పొరపాటు సమర్థించెదు మేము ఉపాయాంతరాభావమువలన కలిగిన (వేరువిధముగ పొసగింప వీలులేదు కావున) ఈ పొరపాటునందు అనౌచిత్యమును చూచుట లేదు. మాలతీమాధవమునందు "[125] నిశ్చ్యోతంతే సుతను, కబరీబిందవో యావదేతే" అను శ్లోకమున నిశ్చ్యోతంతే అని 'శ్చ్యుతిర్' ధాతువునకు ఆత్మనేపదప్రయోగము ప్రామాదిక మనియే తలచుచున్నాము. కాని కొందరు ఆ పదమును 'నిశ్చ్యోతం తే' అని రెండు ముక్కలుగా

---

[123] దశరూపకము 3-34,35.

[124] శాకుంతలము 4-5.

[125] మాలతీమాధవము 8-2

జేసి, 'తే తవ కబరీబిందవః' (కేశపాశమునుండి నీటి బిందువులు) నిశ్ళ్యోతం (స్రవించుటను) అని చెప్పి వాక్యపూర్తికై "యావత్ప్రాప్నువంతి" (ఎంత(కాలము) వరకు పొంచుచున్నవో) అను పదాధ్యాహారముతోడ ఎట్లో సమాధానము చెప్పుచున్నారు.

ఇది ఇచ్చటి సారోద్ధారము- అన్ని భాషలలోను సంస్కృతభాష శ్రేష్ఠము. ఆ భాష వైదిక- లౌకిక వ్యవహారవిషయమై రెండు తీరులైనది. లోకప్రసిద్ధమైన ఆ భాష శాస్త్రాత్మకమైనదనియు, కావ్యాత్మకమైనదనియు ఇరుతెరగుల వ్యవహరింపబడుచున్నది. అందు శాస్త్రములన్నియు కావ్యాంగము లగుటచే శాస్త్రాభ్యాసమునకు కావ్యప్రణయనాదియే ఫలము. ఆ కావ్యమునకు రసమే జీవితము. అట్టి కావ్యమునకు కీర్తివ్యుత్పత్త్యాదులే ఫలము. ఆ కావ్యములు దృశ్యములనియు, శ్రవ్యములనియు ద్వివిధములు. ఈ ద్వివిధకావ్యనిర్మాతలే కవులు. ఆ కావ్యనిర్మాణమునకు శక్తి- వ్యుత్పత్తి - అభ్యాసములు హేతువు. కావ్యములు శబ్దార్థోభయశరీరకములు. వానిలో రఘువంశ శిశుపాలవధాదులు శ్రవ్యములు. వానియందు కవుల ఆశయభేదమును బట్టి భేద మేర్పడుచున్నది. వ్యుత్పత్తి యనగా కావ్యద్రష్టలందు లోక - శాస్త్ర విషయకజ్ఞానము కలిగించుటే. మాధుర్య మనగా రససిద్ధి. అందు నైషధీయ చరితాదులు వ్యుత్పత్తిని మాత్రమే ప్రధానముగా గలిగించునవి. కావుననే "నైషధం విద్వదౌషధమ్" అని విజ్ఞు లనుచున్నారు. ఔషధము పోద్రోలి ఇంద్రియములకు పటుత్వ మిచ్చుచున్నది. అది మధురముగనే యుండవలె నను నియమము లేదు. సహృదయహృదయానందాదికమే మధురము. అచట మాధుర్యమునకు మాత్రమే అనుభవము. ఉభయవిధకావ్యములం దును ఏకప్రయత్నసాధ్యములైన రెండును (వ్యుత్పత్తిమాధుర్యములు) వచ్చి చేరుచున్నను "'ప్రాధాన్యేన వ్యవహారా భవంతి' (ప్రాధాన్యమును బట్టియే సంకేతము) అను న్యాయముచొప్పున తదేకపరత్వము నిర్బాధము. (అనగా వ్యుత్పత్తిమాధుర్యములందు ఏదో ఒక్కటి ప్రధానము, రెండవది అప్రధానముగ నుండును. ప్రధానాంశమును బట్టి వ్యుత్పత్తిప్రధానకావ్య మనియు, మాధుర్యప్రధానకావ్య మనియు వ్యవహరించుటలో దోషము లేదు). కొన్ని చోట్ల ఉభయప్రధానత కూడ నున్నది. శిశుపాలవధ రఘువంశాదులు ఆ కోవకు చెందినవి. అందు ప్రాధాన్య - ఉపసర్జన భావగతభేదముచేత రెండు మార్గములు. శిశుపాలవధమందు వ్యుత్పత్తికి ప్రాధాన్యము, మాధుర్యమునకు అంగభావము. రఘువంశమునందును ఎనిమిదవసర్గపర్యంతమగు కుమారసం భవమునందును మాధుర్యమునకే ప్రాధాన్యము. వ్యుత్పత్తికి అంగభావము.

కనుకనే రెండింట ఒకదానికే ప్రాధాన్యము కాక రెండిటికిని సమ ప్రాధాన్య ముండుటచేతనే "కావ్యేషు మాఘః"(కావ్యములందు మాఘము అనగ మాఘకవిరచిత శిశుపాలవధము శ్రేష్ఠమని భావము) అని మాఘకావ్యము ప్రశంసింపబడుచున్నది. వ్యుత్పత్తికి ప్రాధాన్యము కాక మాధుర్యమునకే ప్రాధాన్య ముండుటచేత రఘువంశాదులు మిగుల కొనియాడబడుచున్నవి. అట్లే వాని రచయితకును అత్యంతశ్లాఘ్యత. "కర్తవ్యం కాలిదాసాదేః కావ్యానాం పరిశీలనమ్" (కాళిదాసాదిరచితకావ్యములను పలుమారులు పరిశీలింప వలయును.) అనియు నిట్టి పెక్కు ప్రశంసాపరవ్యవహారము లేర్పడినది. తదీయకావ్యములందు వైదర్భీరీతియు, అవ్యాజరమణీయమగు కావ్యపాకము, రసప్రాధాన్యము, ఇతిహాసవృత్తాంతపరిజ్ఞానము, ఉపమాద్యలంకారముల రమ్యమగు కూర్పు, ధ్వనిప్రధానత మున్నగు అనితరలభ్యములైన వైశిష్ట్యములు ఆస్వాదింపబడునవి. మాఘాదులందుకూడ పైగుణము లున్నను వ్యాకరణాది శాస్త్రవ్యుత్పత్తివిషయమున అధికాభినివేశ ముండుటచేత రసప్రతిపాదనవిషయమున కొలది క్లేశము కనిపించుచున్నది. అందువలన శ్రవ్యకావ్యములలో రఘువంశముతోడను కుమారసంభవ సర్గాష్టకముతోడను సరితూగగల కావ్యము భువనములందు లేదని ధైర్యముతోడ నొక్కి చెప్పగలము.

దృశ్యప్రబంధనిర్మాణము శ్రవ్యకావ్యనిర్మాణమునకంటె సమధిక వైదగ్ధ్యమును స్ఫురింపజేయునని ప్రాచీనుల యభిప్రాయము. అందుచేతనే కదా "నాటకాంతం కవిత్వమ్" అని వారు పలుమారులు పలుకుచున్నారు. ఆ రూపకములను రసప్రధానములుగా నిర్మింపవలెను. వర్ణనలను తగు పాళ్లలో రసానుగుణముగనే నిర్వహింపవలయును. పెక్కుసంధ్యంగములను సంవిధానసౌందర్యమును సంపాదింపవలయును. నానాప్రకారములగు ప్రకృతులను అనుసరింపవలెను. ఇవియే కాక ఇంక నెన్నో నియమములను పాటింపవలయును. కావున వానిని నిర్మించుటయందు ఎందరో పూనుకొనిరి. కొన్ని రమ్యములైన రూపకములును కనిపించుచున్నవి. అయినను ఇతరదృశ్యకావ్యములకంటె కాళిదాస-భవభూతుల రూపకములే రమణీయతమములు. ఆ విషయమున ఎన్నో హేతువులు నిరూపింపబడినవి. వానియందు కూడ వలదన్నను అయుతసిద్ధముగా (అవినాభావసంబంధముతోడ)వ్యుత్పత్తి యుండనే యున్నది. తిలకింపుడు- "[126] శుశ్రూషస్వ గురూన్" ఇత్యాదులందు నవవధువులకు నీత్యుపదేశమున్నది.

---

[126] శాకుంతలము- 4-17

"[127] చూడాచుంబితకంకపత్ర మభిత స్తూణీద్వయం పృష్ఠతో
భస్మస్తోమపవిత్రలాంఛన మురో ధత్తే త్వచం రౌరవీమ్,
మౌర్వ్యా మేఖలయా నియంత్రిత మధో వాసశ్చ మాంజిష్ఠకం
పాణౌ కార్ముక మక్షసూత్రవలయం దండోఽపరః పైప్పలః."

[జుట్టును తాకెడు అమ్ముల ఈకలు, వీపున రెండు వైపుల అమ్ముల పొదుల జంటయు నున్నది. అధికభస్మము గలిగిన యజ్ఞోపవీత చిహ్నితమైన వక్షఃస్థలము రురువనెడు మృగముయొక్క చర్మమును ధరించియున్నది. మాంజిష్ఠ యనెడి రాగద్రవ్యముతో రంజింపజేయబడిన అధోవస్త్రము (మొలకు గట్టిన ధోవతి) అల్లెత్రాటి మొలనూలుతో కట్టబడియున్నది. చేత విల్లు, జపమాలావలయము పైప్పలదండము (రావిపుల్లయు) నున్నవి." ]

మొదలగు నిట్టి ఘట్టములందును (నీత్యుపదేశమున్నది). ఇందు క్షత్రియబ్రహ్మచారి వర్ణనయందు దానిని గుర్తింపజేసెడు రురుచర్మపు (రురువు-ఒక జాతి జింక) ఉత్తరీయము, అల్లెత్రాటి మొలనూలు, మాంజిష్ఠరాగరంజిత మగు అంతరీయము (క్రింది కట్టువస్త్రము) పిప్పలదండమును (పిప్పలము రావిచెట్టు) పేర్కొనబడినవి. ఇవి కవికి గల సమయాచారప్రావీణ్యము నుగ్గడించుటతో బాటు ఇతరులకు గూడ ఆ విషయమున విజ్ఞానము నాపాదించుచున్నవి. ఆపస్తంబమహర్షి దీనినే (ఈ ఆచారమునే) "జ్యా రాజన్యస్య, మాంజిష్ఠం రాజన్యస్య, రౌరవం రాజన్యస్య, అజినం త్వేవోత్తరం ధారయేత్." [రాజకులమందు పుట్టినవానిచే అల్లెత్రాటి మొలనూలును, మాంజిష్ఠరంజితమగు అధోవస్త్రము, రురుమృగాజినము, ఉత్తరీయమును ధరింపజేయవలెను.] అని చెప్పినాడు.

వీనిలో కాళిదాసీయ రూపకములందు మాళవికాగ్నిమిత్రము నాటిక, విక్రమోర్వశీయము తోటకము అనియు ఈ రెండును ఉపరూపకములందు లెక్కింపబడినవి. వీనిలో మొదటిదానికంటె రెండవది రచనాదివైశిష్ట్యముచేత శ్లాఘ్యతరము. ఆ రెండిటికంటెను శాకుంతలము ప్రశస్తమైనదని సర్వసంప్రతిపన్నము. భవభూతిరూపకములు గూడ మూడే - మాలతీమాధవము, వీరచరితము, ఉత్తరరామచరితము. వీనిలో కడపటిదగు ఉత్తరరామచరితము చిత్తద్రవీకరణకారణమగు విప్రలంభశృంగారప్రాధాన్యముచేతను, సదుపదేశముల

---

[127] ఉత్తరరామచరిత్రము - 4-18

సమృద్ధిచేతను, అత్యంతమనోజ్ఞరచనాశోభితమగుటచేతను, లోకోత్తర ధీరోదాత్తనాయకవిషయక మగుటచేతను ఇవిగాక మునుపే వివరింపబడినవియు, వాఙ్మనసాగోచరములగుటచేత అనుభవమాత్రసుజ్ఞేయములును అగు పెక్కు విషయములచేత మిక్కిలి ప్రశంసనీయమై భూతభవిష్యద్వర్తమానములందు నిస్సమాభ్యధికమై దోషలేశాస్పృష్టమై సకలజనానందపరీవాహమై సర్వోత్కృష్టమై యున్నది. విశ్వవిలక్షణుడైన పరబ్రహ్మయే స్వయముగ ఈ గ్రంథప్రతిపాద్యుడై యున్నాడు. ఇప్పుడీ విషయమును కేవలము మేము మాత్రమే నిర్ధరించుటలేదు. మరి, క్లేశజ్ఞుడును, మచ్చరము లేనివాడును, గుణముల లోతుపాతులను పరిశీలించుటలో పదునైన ప్రజ్ఞగలవాడును, సహృదయచక్రవర్తియు, కవికులశిరోరత్నమైన వాడును అగు కాళిదాసుడే నిర్ణయించినాడు. అదెట్లన- తన పద్యమున "వయమేవ వా" అని పలుకుచు రూపకాంతరములకంటె తన రూపకములకు ఉత్తమత్వము, "ఉత్తరే రామచరితే భవభూతి ర్విశిష్యతే" అనుచు భవభూతికే (ఉత్తరరామచరితదృష్ట్యా) సర్వోత్తమత్వమును చెప్పినాడు. ఇతరరూపకముల ప్రసక్తియే లేదు కావున వానికి స్మరణమార్గావతరణమే లేదు. కాబట్టి లోకోత్తరనాయకాశ్రయమై సర్వశ్రేష్ఠమగు ఉత్తరరామచరిత్రమందు పెక్కు గుణములున్నవని దానినే సర్వకాలసర్వావస్థలయందు పరిశీలించుటచేత, అట్టి గుణగరిష్ఠుడగు మహాకవిసార్వభౌముని యెడ కృతజ్ఞతామాత్రముచేతనే భవభూతికి వశవర్తిని యగు భగవతియైన భారతిని తమకు వశవర్తినిగా నొనర్చుకొనుచు, తదీయకవితారసనిష్యందసంభృతములును, సరసములై, మధురములై, చిక్కనై, చల్లనై, స్నేహసుందరములైనవియు, సమగ్రగుణగ్రామప్రవాహములై నిసర్గసుందరములగు ప్రబంధములను రచించుచు తమ కీర్తిదుకూలాంచలములచేత నిఖిలదిశాంగనలను అలంకరించుచు, అస్మదీయహృదయములకు హరిచందనముచేతనుంబోలె మైపూత లలందువారై పరమానందసందోహమును కురియువారై సహృదయులగు సుహృత్తులెల్లరు సర్వోత్కృష్టులై వెలుగొందుదురు గాక! సకలము సమంజసము!

గుణానా మావాసః ప్రశమితదురాతంకదహనః
శ్రియా దేవ్యా శశ్వత్సహచరితధర్మా రఘుపతిః,
అమందం సమ్మోదం దిశతు కరుణాసారమసృణైః.
కటాక్షైః కహ్లారవ్యతిభిదురనీలాబ్జసుషమైః. 1

[గుణములకు నివాసస్థానమై, దుర్దమవిపదనలమును శమింపజేయు

వాడై లక్ష్మీదేవికి సతతసహధర్మచారి యగు రఘుపతి కరుణామృతప్లావితములై కల్హారమాలలతో కలిసిన నల్లకలువల శోభాసంపత్తిని పురిణించు కటాక్షములతో అమందానంద మందించుగాక!

వైదేహీమయజీవితస్య జగదానందైకసంధాయినః
పాశ్చాత్యం చరితాద్భుతం రఘుపతేః శృంగారభంగ్యాऽఙ్కితమ్,
శాణోల్లీఢనిశాతశారదశశిజ్యోత్స్నాభిరామం సదా
చేతస్సీమని నశ్చకాస్తు కుశలారంభం చ సంభావయేత్. 2

[జనకజామయజీవనుడును సకలజగములకు నానంద మొనగూర్పు టలో మేటియైనవాడును అగు రఘురాముని శృంగారభంగీసమాలింగితమై సానబట్టించి తులకింపజేసిన శరత్కాలపు చంద్రచంద్రిక వలె మనోభిరామమగు అద్భుతోత్తరచరిత్రము మా మానసవీథులందు నెల్లవేళల వెలింగెడుగాక! సర్వక్షేమంకరమై నెగడుగాక!]

విపాకవశనిష్పతన్మసృణమృద్వికానిస్సర-
న్మరందరసమాధురీమదహరై ర్వచోవిభ్రమైః,
సనాతనగురోర్హరేశ్చరిత మద్భుతం భావయన్
ధినోతి హృదయం న కస్య భవభూతినామా కవిః. 3

[మిక్కిలి విపక్వములైన ద్రాక్షగుత్తులనుండి జాలువారెడు చిక్కని మకరంద రసమాధుర్యమదమును సదమదము చేయు వాగ్విలాసములచేత సనాతనగురువగు శ్రీహరియొక్క అద్భుతచరిత్రమును భావింపజేయుచున్న భవభూతినామధేయుడగు కవి యెవ్వని హృదయము నానందింపజేయడు?].

న పాండిత్యోత్సేకాన్న చ పరిచయాద్వా కవిగిరాం
న వాదశ్రద్ధాద్యైర్న చ మహిమసంపాదనధియా,
సమజ్యాయా మేతత్కృమపి విదుషాం చాపల మధా-
మహం కింతు ప్రాప్తుం దిశి దిశి పరీహాసపదవీమ్. 4

[పాండిత్యగర్వముచేత కాదు, కవివాక్కులతో నున్న పరిచయభర మువలనను గాదు, వాదముపైని ఆదరాదులవలనను గాదు, మహిమ సంపాదించు తలంపునను కాదు, మరి దిక్కులన్నిట పరిహాసభాజన మగుటకే సభలో ఏదో ఒక చాపలము చూపితిని.]

ఇత్థం మయా సపది కావ్యపథానురోధాత్
కస్మింశ్చిదత్ర గదితే గుణదోషయోస్తు,

నిర్మాణనిర్మలహృదః కృతినః కృతీనాం
నిర్మత్సరా స్సహృదయా స్సుధియః ప్రమాణమ్. 5

[ఈ విధముగా నేను కావ్యమార్గానువర్తినై వెంటనే ఏదో నుడివితిని. కృతులను నిర్మించి నిర్మలమైన హృదయము కలవారును, మత్సరము లేనివారును, నిశితబుద్ధులును, సహృదయులును అగు ధన్యాత్ములే ఇందలి గుణదోషముల విషయమున ప్రమాణము.]

లక్ష్మీనృసింహసుతతాతకులావతంసః
శ్రీమత్కుమారకవిభూషణతాతసూరిః,
వాచా మహాకవిమణే ర్భవభూతినామ్న-
స్సాంద్రామృతేన సుహృదామదిశత్సపీతిమ్.

[లక్ష్మీనృసింహకుమారతాతకులమునకు తలమానికమైనవాడును, కవిభూషణ బిరుదాంచితుడును అగు శ్రీకుమారతాతాచార్యనామధేయుడు భవభూతి యను పేర బరగిన మహాకవిరత్నముయొక్క మధురవచనములందలి చిక్కని తీయని యమృతధారచేత ఉదారహృదయులగు మిత్రులకు సహపంక్తిపానము నొసగినాడు].

భవభూతిభారతి సమాప్తము.